PRSUMOZA179

సాహిత్య ప్రస్థానం
ఏప్రిల్ 2017

సంపుటి : 16 సంచిక : 4

# మళ్లీ మళ్లీ మన వేమన

వందల ఏళ్లయినా వేడి తగ్గని మహోష్ణజ్వాలా తోరణం వేమన. శతాబ్దాలు కరిగిపోయినా కర్ణపుటాల్లో మార్మోగుతూనే వున్న సత్యశక్తిస్వరం వేమన.

గత కాలము మేలనే వాళ్లకూ ఇప్పటికీ దాన్నే పట్టుకు వేళ్లాడదామనే వాళ్లకూ అప్పుడే జవాబులు చెప్పి వెళ్లిన అసమాన సృజనశాలి అభేధ్య ఖడ్గదారి వేమన. యోగులూ బైరాగులూ ఏలికలవుతున్న వేళ.. వాస్తులూ వక్రాలూ వ్యవస్థలను శాసిస్తున్న వేళ.. ఛాందసత్వం రాజకీయాల్లోనూ, మూఢత్వం వ్యూహాత్మక వాస్తవికతలోనూ పునరుద్ధరించబడుతున్న వేళ మనకు తోడుగా నిలిచే మహోన్నత శక్తి వేమన. మనకు వెలుగు చూపే అనంత కాంతి వేమన.

అప్పుడూ ఇప్పుడూ కూడా వేమనపై అధ్యయనాలు తక్కువే. అధినేతలకు, అధ్యాత్మికులకూ ఆయన కొరకరాని కొయ్యే. ప్రశ్నకూ ప్రతిఘటనకూ మారుపేరుగా ఆలోచనకూ అన్వేషణకూ మరోపేరుగా మరెవరికన్నా మించి తెలుగువారి గుండెల్లో గూడుకట్టుకున్న వేమన అంటే ఆధునిక అజ్ఞానుల గుండె గుభేలే. సరిగ్గా ఆ కారణంగానే వేమన మనకు వేగుచుక్క. మార్గదర్శి. గతంలో పలువురు పరిశోధకులు సామాజిక సాహిత్య సత్యాన్వేషులూ ఎలుగెత్తి చాటిన వేమన వారసత్వాన్ని వీరతత్వాన్ని మరోసారి స్మరించుకోవడం అవసరమన్న ఆలోచనే అనంతపురంలో జరుగుతున్న విశాల సమ్మేళనానికి భూమిక. అందరం పాల్గొందాం. ఆ చైతన్య స్వరాన్ని ఈ తరానికి మరింత గట్టిగా వినిపిద్దాం. ఆ రచనలు పరిశోధనలు అందిద్దాం. ఎందుకంటే మన వేమన ఎప్పటికీ ఒకే ఒక్కడు.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజి, గంగాధర్

## ఈ సంచికలో ...

కవిత ... 4
కూడు (కథ) ... 5
కవిత ... 8
మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్.... 9
కవిత ... 16
నాటక సాహిత్య సజీవ నది శ్రీశ్రీ... 17
కవిత ... 21
పదుగు పేకల కలనేత కవి శీలా వీర్రాజు ... 22
కవిత ... 25
బొగ్గుల బట్టీ (కథ) ... 28
కవిత ... 30
వాస్తవ జీవిత ప్రతిబింబాలు నిర్మలా రాణి కథలు... 31
కవిత ... 36
పూర్వీకుల ఎముకలు (కథ) ... 37
కవిత ... 40
తెలుగు నేలపై కన్నడ శాసనాలు:
కరీంనగర్ జిల్లా . ... 41
కవిత ... 44
స్వీకారం... 45
కవిత ... 48
డైరీ... 49



మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం,
డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి,
గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

## చరిత్ర చెత్తకుప్ప!

నిఖిలేశ్వర్
9177881201



చరిత్ర చెత్తకుప్పలోకి
విసిరి వేయవలసినవన్నీ
ఫేస్‌బుక్ నకిలీముఖాలతో
పడగవిప్పిన పాముల్లా
ప్రలోభాల కోరలతో
సైబర్ ప్రపంచమంతా
విషం చిమ్ముతున్న దృశ్యం !

మత రాజకీయాల
ముసుగులో
నాగరికత
కులం కంచెలమాటున
తెగల ముఠారాజకీయాల
అగ్గిని రాజేస్తున్న
కుటిలనాయకత్వం

వర్తమాన చరిత్ర అంచులపై
వికటాట్టహాసం చేస్తున్న
రాజకీయ జూదరుల చేతుల్లో
అధికార మంత్రదండం...!
ఇక చరిత్ర చెత్తను కెలుకుతూ
వక్రీకరించే వ్యాఖ్యానాలతో
శ్రమసంపదను కబలిస్తున్న
దళారుల రాజీ బేరాల
పైరవీల సర్దుబాట్లతో
ఊరేగుతున్న మహానుభావులంతా
చరిత్రహీనులుగా
తిరిగి చరిత్రకుప్పలోకి !!

---

## బంధం

- నందవరం కేశవరెడ్డి
9885120878



కొత్తమనిషి దగ్గరైనప్పుడు
కొత్త పుస్తకం అందుకున్నట్లుంటుంది
చూపులు కలుసుకున్నప్పుడు
పుస్తకం వెలుగుతున్నట్లుంటుంది
పెదవులు విచ్చుకుంటున్నప్పుడు
పేజీలు తిప్పుతున్నట్లుంటుంది
అనుభవాలు, అనుభూతులు చెప్పుతుంటే
ఆత్మీయంగా పుస్తకం గుండెలకు హత్తుకున్నట్లుంటుంది
సంఘటనలు సందర్భాలు దొర్లుతున్నప్పుడు
పేజీలు పరిగెత్తుతున్నట్లుంటుంది
చివరకు ఆత్మీయుడిగా ఉండిపోయినప్పుడు
జీవన గమనంలో పుస్తకం భాగమైపోతుంది
మనిషికి పుస్తకానికి
పుస్తకానికి మనిషికి
పెనవేసుకున్న బంధం

---

## మార్చి నెల పురస్కారాలు

**సమకాలీన కవిత్వ చిత్రణ 'పునాస'**
వ్యాసానికి: రూ.500/-
రచయిత :సిద్దెంకి యాదగిరి

**అంతరంగ తరంగం**
కథకు: రూ.700/-
రచయిత : చెన్నా రామమూర్తి

**ఆకుపచ్చని కన్నీరు**
కవితకు : రూ .500/-
రచయిత
: అమూల్యాచందు కప్పగంతు

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి
పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్



# కూడు

- టి. సతీశ్
9391614443

'పొయ్యి అంటించాలి. ఈరోజు పండగ. ఎవరింట్లోనూ సంగటి చేసుకోరు. ఈ ముసిలోడికేమో సంగటి తింటేనే అసలైన పండగ. ఏమిచేసేదిరా బగమంతుడా' అని ఈరమ్మవ్వ వెతికీవెతికీ ఒక్కొక్క పుల్లనే ఏరుకుంటూ పక్కనున్న గోనెసంచిపై ఏసుకుంటోంది.

ఈరమ్మవ్వకు ఎనభై ఏళ్ళుంటాయ్. లేస్తే కూర్చోలేదు, కూర్చుంటే లేవలేదు. ఎంకటేశప్పతాతకు తొంభై దాటింది. మూడోకాలు లేకుండా కదల్లేడు. వీళ్ళుండేదొక పెంకుటింట్లో. అది పాడుబడలేదు గానీ, దీనికంటే పాడుబడిన ఇల్లేనయం. గబ్బిలాలకు ఇళ్లు పాడుబడితే సుఖం. సౌఖ్యం. వీళ్ళకు అదీ లేదు.

ఇంటిచుట్టూ తడికలతో ప్రహరీ. ఇంటిముందు హరప్పా శిథిలాల్నుంచీ బయటపడినట్లున్న తోట ఆనవాళ్ళు. ఇంటిముందు నాలుగు మూలలా నాలుగు ఎండిన కొబ్బరిచెట్లు. ఎడమవైపు చివర కట్టెలు, బెరళ్లు, కంపలు. దానిపక్కనే ఆడవాళ్లుస్నానం చేయడానికి ఊడిన మట్టిపెళ్లలు, ఎర్రని మట్టి గోడలతో వేసిన కప్పులేని బచ్చలి. కుడివైపు మగాళ్లు హాయిగా కూర్చుని స్నానం చేయడానికి వేసిన పెద్దబండ. దానిపక్కనే నీళ్లు కాచడానికి పొయ్యి. దానికి కాస్తముందు ఎండిన మల్లెచెట్ల వరుసలు. ఎడంవైపు ఇంటికి దగ్గరగా పాత్రలు కడగడానికి కొబ్బరిచెట్టుపాదులో ఒడిదుడుకుల బండ. ఇంటిలోకి అడుగుపెడితే ఎదురుగా దేవుళ్ల పటాలు. తలుపుకు కొద్ది ఎడం పక్కగా నాలుగడుగుల ఎత్తులేపిన గోడ. ఆ గోడకు అటువైపున్నది వంటగది. ఇటువైపు హాలు, పడకగది, కాగుల దొంతర్లు, సామానులు, ఇంటి వస్తువులు వగైరా వగైరా... అన్నీ ఒకేచోటో, ఒకేచోట అన్నీ కలగలిసిపోయాయో చెప్పడం కష్టం.

ఒకప్పుడు ఎంకటేశప్పతాత నాజూకైన, తెలివైన, ఊరికి తలలోనాలికలాంటి 'మంగలోడు'. మంచి వయసులో ఉండగానే ఈరమ్మవ్వతో పెళ్లయింది. ఈరమ్మవ్వను ఇప్పుడు కాస్త తెరిపార చూసినా ఆ మొహంలోని కళనుబట్టి ఇట్టే తెలిసిపోతుంది యవ్వనంలో ఎంత అందంగా ఉండేదో. స్వాతి, విపుల పత్రికలు చదివేంత చదువుంది. ఆ చదువుతో కొంత జ్ఞానమూ అబ్బింది.

పెళ్లైన కొత్త. దీపావళి పండగ. మిట్ట మధ్యాహ్నం. ఈరమ్మవ్వ చేతికి వాళ్ల అత్త ఒక వెదురుగంప ఇచ్చింది. దానిలో తెల్లని పంచ. నాలుగు మడతలేసి పరచి ఉంది. దానిలో రెండు చిన్న పాత్రలు, రెండు పెద్ద పాత్రల ఉన్నాయ్.

వాళ్లత్త ఇంకో గంప తీసుకొంది. దాన్ని చంకలో పెట్టుకొని, కొంగు కప్పింది. ఈరమ్మవ్వ అలాగే చేసింది. అత్త ఊర్లోకి బయల్దేరింది. కొత్త కోడలు అనుసరించింది.



చాలా ఇళ్లు తిరిగారు. గంపలు నిండి పోయాయ్. పాత్రలూ నిండి పోయాయ్. రకరకాల కజ్జాయిలు (అత్తిరసాలు), అన్నం, రకరకాల సాంబార్లు, రసం... సాంబారు పాత్రలు నిండిపోతే, ఒక చిన్న డేక్సాలోని అన్నంపైనే రెండు, మూడు రకాల కూరలు, సాంబారు వేసుకొన్నారు. ఊర్లోవాళ్లు ఇచ్చింది వద్దంటే, మళ్లీ కావాల్సినప్పుడు వాళ్లు పెట్టరని అత్తకు బాగా తెలుసు.

ఇంటికి తిరిగొచ్చేసరికి సాయంత్రమైంది. ఈరమ్మవ్వకు గంప, పాత్రలు చంకలో పెట్టుకొని ఇల్లిల్లూ తిరగడం అదోలా ఉంది. రెండు, మూడు కూరలు, సాంబారు కలిసిపోయిన అన్నం తినాలనిపించేదికాదు. ఆ పూటకు ఏదో కొంచెం తిని ఊరకుండిపోయింది.

సంసారం సుఖంగా సాగిపోతుండగా ఓరోజు ఈరమ్మవ్వ ఎంకటేశప్పతాతతో–

'మామా నువ్వు ఈ పని మానేసేయ్. టవునికెళ్ళి వేరే పనేదైనా చేసుకుందాం" అంది.

"ముదనష్టపుముండా, తల్లిలాంటి ఊరిని, దైవంలాంటి కులవృత్తిని వదిలేయమంటావా? ఇంకోసారిట్లా మాట్లాడితే ఎముకలిరిగిపోతాయ్"

అంతే. ఈరమ్మవ్వ కళ్ళు ఎర్ర కలువలయ్యాయ్. గుండె బరువెక్కిపోయింది. కొంగు ముఖానికి అడ్డం పెట్టుకొని వంటగదిలో ఓ మూల ముడుచుకొని కూర్చుంది.

ఊర్లో ఏ పండగొచ్చినా పబ్బమొచ్చినా, జాతర జరిగినా మేళం, డోలు, తాళం అన్నీ ఎంకటేశప్పతాత చూసుకునేవాడు. ఊర్లో ఏ ఇంట్లో అమ్మాయి పెద్దమనిషైనా, ఏ శుభకార్యం జరిగినా వాళ్ల బంధువులందరికీ ఎంకటేశప్పతాతే సమాచారం ఇచ్చేవాడు. ఇక పెళ్లిళ్లమాట చెప్పనవసరంలేదు. పెళ్లికి వాయిద్యాలన్నీ సమకూర్చుకొనేవాడు. తను స్వంతంగా మేళం వాయించేవాడు. నాదస్వరం వాయిస్తుంటే ఊరిజనమంతా, సంగీతమంటే ఏమో చెప్పలేనోళ్లంతా, దానిలోతులు తెలీకే సంగీతసాగరంలో మునిగిపోయేవాళ్లు. మేళం వాయించేంత సేపూ 'వీడు అందర్నీ మాయచేసే మాంత్రికుడురా' అనుకొనేవాళ్లు. ఈ మాటలువిని ఎంకటేశప్పతాత మురిసిపోయేవాడు. పెళ్లంతా నాదే అన్నట్టు పెళ్లి పనులు చూసుకునేవాడు. పెళ్లి కొడుక్కి నున్నగా క్షవరం చేయడం, కాలిగోర్లు తీయడం, పెళ్లయ్యే వరకూ, అయింతర్వాత హడావుడి సద్దుమణిగే వరకూ ఆ ఇంట్లోనే ఉండేవాడు.

ఊర్లో అందరికీ ఎంకటేశప్పతాతే క్షవరం చేసేవాడు. మాల, మాదిగలకు క్షవరం చేయడానికి కత్తెర, కత్తులు, దువ్వెన్లూ వేరుగా పెట్టేవాడు. లేకపోతే ఏం జరుగుతుందో ఎంకటేశప్పతాతకు బాగా తెలుసు. చిన్న, పెద్ద, ఆడోల్లందరికీ ఎంతటేశప్పతాత బాగా చనువైన మనిషే. కరణం, రెడ్డి, నాయుడు ఏదైనా ఊరికెళ్లాలంటే అర్ధరాత్రైనా, అపరాత్రైనా వెళ్లి నున్నగా క్షవరం చేయాలన్నా, చేన్లలోకి వెళ్లిన ఏ రైతు కాలిలో ముల్లు గుచ్చుకున్నా ఎంకటేశప్పతాతే దిక్కు. దీంతో ఊర్లోని అన్ని కులాలోళ్లకీ ఎంకటేశప్పతాత అవసరం ఖచ్చితంగా ఉండేది.

ఎంకటేశప్పతాత ఊరందరికీ ఇంత పనిచేస్తే ప్రతిఫలం 'మేర' రూపంలో దొరికేది. సంవత్సరానికింతని రైతులనుండి కొంత రాగులూ, వడ్లూ, మిరపకాయలూ, చెనిక్కాయలూ, చింతపండూ... ఇలా దొరికేది మేర. కాలానుగుణంగా పండేవీ, మధ్యమధ్యలో పప్పులూ, ఎర్రగడ్డలూ, కూరగాయలూ... అప్పుడప్పుడూ తీసుకునేవాడు. ఇవన్నీ ఇష్టమొచ్చినన్ని తీసుకోడానికిలేదు. వాళ్లు ఎంత వేస్తే అంత. ఈ మేరతో వచ్చిన పంటగింజలు సంవత్సరమంతా వచ్చేవికావు.

ఎంకటేశప్పతాత ఉదయమే అడపం ఎత్తుకొని ఊరిమీద పడేవాడు. పది, పదకొండు గంటలకు ఎవరింట్లో పని చేస్తుంటే వాళ్లింట్లో ఒక సంగటిముద్ద తినేసేవాడు. పనిలో పడిపోయేవాడు. వంటకు ఇంట్లో ఇబ్బందైన రోజుల్లోనూ పరిస్థితి ఇదే. ఇంట్లోవాళ్లు తిన్నారా? లేదా? అనే ఆలోచన ఉండేదికాదు.

ఈరమ్మవ్వ బియ్యం, పప్పూ గిప్పూ అయిపొయ్యిందని

చెబితే విని ఊరకునేవాడు. మళ్లీ మళ్లీ పోరుపెడితే గట్టిగా అరిచేసేవాడు. రాగులు అయిపోయాయంటే నసిగీ నసిగీ, చనువుగా వాళ్లనీ వీళ్లనీ అడిగి ఏదోరకంగా తీసుకొచ్చేవాడు. ఈరమ్మవ్వకు ఒక్కోసారి కోపం వచ్చేసేది. దానికంటే ఎక్కువగా బాధపడిపోయేది.



పత్రికలు చదివిన జ్ఞానం ఈరమ్మవ్వను ఊరకే ఉండనివ్వలేదు. మఫ్లర్, తిత్తులు, బ్యాగులు... లాంటివి అల్లేది. అందంగా సవరాలు పేనేది. వాటికి పదో పరకో అందేది. 'మేర'కు ఈరమ్మవ్వ ఈమేరకు జతచేసేది. కొద్ది అటూఇటుగా సంసారం సాఫీగానే సాగిపోయేది.

కాలచక్రం తిరుగుతోంది. ఎంకటేశప్పతాతకు చూపు తగ్గుతోంది. ఈరమ్మవ్వకు శక్తి తగ్గుతోంది.

క్రమంగా ఎంకటేశప్పతాత అడపం గూట్లోనే నిద్రపోయింది. నాదస్వరం గోడెక్కింది.

ఈరమ్మవ్వ చిన్న పాత్రలతో ఊర్లోకి వెళ్లొచ్చేది. ఒక్కోసారి పాచిన అన్నం, చారు వేసేవాళ్లు. కొంతమంది అంతదూరంలో ఈరమ్మవ్వ కనబడగానే తలుపు వేసేసుకొనేవారు. కొత్తకోడళ్లు 'రోజూ అన్నం పెట్టమంటే ఎక్కణ్ణుంచీ వస్తుంద'నే గుసగుసలు. ఈరమ్మవ్వ చెవిలో పడాలనే. మూడు పూటల భోజనం రెండు పూటలకు తగ్గింది.

ఈరమ్మవ్వకు తెలిసొస్తోంది. అయినా ఇవన్నీ తప్పడంలేదు. 'ఊరోళ్లందరికీ నా మొగుడు చాకిరీ చేసీచేసీ చచ్చాడు. ఒంట్లో ఉన్న శక్తంతా ఊరికే ధారపోశాడు. ఇదంతా ఏ నాబట్టలకు, సవతులకు తెలుసు?' అని మనసులోనే కుమిలిపోయేది.

రేషన్ బియ్యం వచ్చేది. చాలీచాలని పప్పు, చెక్కెర, కిరోసిన్... ఇచ్చేవాళ్లు. అవన్నీ మోసుకొచ్చేశక్తి కూడా లేదు. మాల ఎంకడో, మాదిగ సుబ్బడో ఇంటి దగ్గరకు ఆ మూట తెచ్చి ఇచ్చేవాళ్లు. వంట చేసుకుందామన్నా కట్టెలుండవు. గ్యాసంటే తెలీదు. వంటలోకి ఉప్పో, కారమో, చింతపండో, ఎర్రగడ్డో ఏదో ఒకటి, రెండు తక్కువయ్యేవి.

ఒకోసారి అన్నం బాగాలేదని, చారు బాగలేదని ఎంకటేశప్పతాత, ఈరమ్మవ్వను తిట్టేవాడు. అంతే వేగంగా, గట్టిగా'నువ్వేమైనా గవర్నమెంటు ఉద్యోగం వెలగబెట్టావా, రిటైరైనా రూపాయలు చేతికి రావడానికి?' అనేసేది. తర్వాత బాధపడిపోయేది ఈరమ్మవ్వ.

ఎంకటేశప్పతాత ఒక సంగటిముద్ద (ఇపుడు రాయలసీమ రుచుల్లోని మూడు సంగటిముద్దలు కలిపినంత ముద్ద), కంచం నిండుగా అన్నం తినేవాడు. ఈరమ్మవ్వకు ఎప్పుడోగానీ ఎంకటేశప్పతాతకు సంగటి తెచ్చిపెట్టే 'భాగ్యం' దొరికేదికాదు. ఎంకటేశప్పతాత తినడమూ తగ్గించేశాడు. ఒక్కోసారి అనలే తినేవాడుకాదు. ఎంకటేశప్పతాత ఆకలి ఈరమ్మవ్వకే తెలుసు.

ఎంకటేశప్పతాత రోజులో ఎక్కువ భాగం తోటమధ్యలోనే కూర్చునేవాడు. అక్కడే రోజూ పొద్దున్నేలేచి నాదస్వరం వాయిస్తూ ఉండేవాడు. అక్కడే ఎంతోమందికి నాదస్వరం నేర్పింది. అక్కడే స్వరాలు తప్పుగా వాయించిన పిల్లల తొడలపై అరుణారుణకాంతులతో సంగీత శిక్ష(ణ) ఇచ్చింది. అక్కడే కొడుక్కు ఇష్టంలేకపోయినా నాదస్వరం నేర్పించాలని పట్టుబట్టింది. అక్కడే నాదస్వరం పగలగొట్టి తన కొడుకు తిరిగిరానంతదూరం ప్రపంచంలోకి పారిపోయింది.

పండగరోజు. ఎంకటేశప్పతాత తోట మధ్యలోనే ఉన్నాడు. వెనకటి వైభోగం గుర్తు చేసుకొంటున్నాడు. పొట్టలో పేగులు పక్కటెముకల్ను కావలించుకొని ఎందుకో అరుస్తున్నాయ్. ఆ అరుపులు తాతకు కొత్తకాదు. కానీ కళ్లెందుకో మూతలుపడుతున్నాయ్. పెళ్లైన కొత్తలో పెళ్లాం చెప్పిన మాటలు గుర్తుకొస్తున్నాయ్. పెళ్లాంది ఎంత ముందుచూపో ఇప్పుడర్థమౌతోంది. ఈరమ్మవ్వకు ఏదో చెప్పాలనుకొంటున్నాడు. కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయ్. లేవబోతున్నాడు. శరీరం కదలడంలేదు. బలవంతంగా కళ్లు తెరిచాడు. ఆ కళ్లల్లోంచి 'అది వైభోగంకాదు, బానిసబతుకు...' అని ఏవేవో మాటల్లేని భావాలు ఈరమ్మవ్వవైపు పరిగెడుతున్నాయ్.

ఈరమ్మవ్వ ఇంకా పుల్లలేరుతూనే ఉంది.

ఇంట్లో ఓమూల బూజుపట్టిన నాదస్వరం విషాద సంగీత స్వరాల్ని పలుకుతోంది. తలుపుకెదురుగా గూట్లో దుమ్ముపట్టిన అడపం దుఃఖిస్తోంది. ఆ స్వరాలూ, ఆ దుఃఖం ప్రపంచంలో ఎవరికీ వినిపించడంలేదు. కనిపించడంలేదు. ❋

# ఆ బువ్వ మట్టిలో కలిసింది

- డాక్టర్ కత్తి పద్మారావు
9948748812



కుండలు చట్టులు కర్రకు గట్టుకొని
రాష్ట్రాల నిండా నడుస్తున్నారు
చిరుగుపాతల్తో దిగాలుబడ్డ ముఖాలు
ఆ బుడ్డోడు బడి ఎగ్గొటి బయలుదేరాడు
వాడి బడికి ఎన్నిసార్లు గళ్ళుపడ్డాయో
పచ్చికారం మూట గట్టుకొని
గట్టు మీద కాపురం పెట్టారు
ఇటుచూస్తే అంతస్తుల్లో అద్దాల మేడల్లో
ఏసీల్లో చల్లగా జీవిస్తున్నారు
పప్పీలకు బిస్కెట్లు మేపుతూ...
గోళ్ళకు రంగులేసుకుంటూ...
తలకు వెన్నాలు పెట్టుకుంటూ...
ఫేషియల్ చేయించుకుంటూ...
కనుబొమ్మలు రంగుల
పెన్సిళ్ళతో దిద్దుకుంటూ జీవిస్తున్నారు
ఒకపక్క తగరాల గుడిసెల్లో
దోమల గుంపుల గుయ్యారంలో
మురుగు కాల్వలపైన రెండు బండరాళ్ళు వేసి
చంటిబిడ్డకు నీళ్ళు పోస్తున్నారు
మరొకపక్క ఆ వృద్ధుడు చూడు
పదెకరాల భూమికి అరక దున్నినోడు
నీళ్ళు లేక, పసుగాసం లేక
జిల్లాలు దాటివచ్చి
పడిపంచన చావిళ్ళలో పండుకున్నాడు
ఆ ప్రక్కనే పండుకున్న ఎద్దుకు గాయం అయ్యింది
అది పుండయ్యింది రసిక కారింది
పెద్ద పెద్ద గండు ఈగలు వాలుతున్నాయి
ఆ పక్కన ఆ ముసలావిడ
పిల్లల్ని పొదుక్కొని పండుకొంది
వలస బతుకుల చిత్రాలు
గుండెల్లో గునపాలేస్తున్నాయి
ఆ పడతేమో!
జాకెట్టుకు ఎర్రటి, పచ్చటి రాళ్ళు
కుట్టించుకుంటుంది
కనుకొల మీద తళుకులు అద్దుకుంటుంది
భుజాల మీద ప్రియుడి బొమ్మలు
పచ్చలు పొడిపించుకుంటుంది
ఆ వనితకు చూసుకొని చూసుకొని
అద్దం ముక్కలు అవుతుంది
ఆ తల్లిదండ్రులు పొలం వెళ్ళారు
ఆ చంటిపిల్లకు బువ్వ తినిపిస్తున్న
ఆ ఎడగారు పిల్ల తల మీద గద్ద తన్నింది
పళ్ళెం మట్టిలో బడింది
బువ్వ ఆ మట్టిలో కలిసింది
పిల్ల కెవ్వుమని అరిచింది
కాకులూ పెద్దగా అరిచాయి
ఆ అమ్మాయి కళ్ళు ఎర్రబడ్డాయి
ఆ సువార్త తల వెంట్రుకలు
ఎండిన నారపీచులయ్యాయి
తలకి నూనె లేదు
నడెండలో నడుము వంచితే
నేల కాలుతున్నా కాళ్ళు కదపదాయే!
ఈ మట్టి ఆమెకు రుణపడి ఉంది
భరత భూమిలో అందరూ ఒకటిగానే పుట్టారు
ఒకరిది సుఖ: భోగం, మరొకరిది దు:ఖార్తం
ఈ వైరుధ్యాలను బద్దలు కొట్టే రోజు కోసం
ఒక ఆశా దీపం
ఒక అక్షర జ్వాల

**(కర్నూలు నుండి గుంటూరు జిల్లా మాచర్లకు పనులకు వచ్చిన వలస జీవులను చూసి)**

# మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్

- దాసరి శివకుమారి



*రాహుల్ సాంకృత్యాయన్ తన జీవన ప్రధమసోపానంలో దయానంద సరస్వతి పట్ల, ఆర్య సమాజ సిద్ధాంతాల పట్ల గొప్ప ఆకర్షితులయ్యారు. దయానంద విరచిత 'సత్యార్థ ప్రకాశిక''ను ప్రామాణిక గ్రంథంగా అంగీకరించి దానికనుగుణంగా నడుచుకున్నారు. ఆ తర్వాత బౌద్ధ త్రిపిటక, సిద్ధాంతాల పట్ల ఆకర్షితులయ్యారు. వాటిని ఎంతగానో ఆరాధించారు. బౌద్ధయుగం నాటి భారత దేశ చరిత్రను గురించి తాను తెలుసుకుని తన ఉపన్యాసాల ద్వారా, రచనల ద్వారా ప్రజలకు తెలియజేశారు. బుద్ధుని నీతి న్యాయసూత్రాలు, టిబెటన్, పాలీ, పైశాచీ భాషల్లో ఎన్నో వేల తాళ పత్ర గ్రంధాల్లో పొందుపరచబడి వున్నాయి. వాటన్నింటినీ అధ్యయనం చేసి అనువాద గ్రంధాల ద్వారా మనకందించిన మహోన్నతుడు. అంతకు మించిన ప్రతిభావంతుడు.*

విలక్షణ ప్రపంచ యాత్రికునిగా, ఉత్తమ చరిత్ర పరిశోధకునిగా, బహుభాషా పండితునిగా, రాహుల్ సాంకృత్యాయన్ విశ్వ ఖ్యాతి నార్జించారు. భారతదేశంలోని అన్ని రాష్ట్రాలు, ముఖ్య నగరాలు, చారిత్రిక ప్రదేశాలు దర్శించి, అచటి ప్రజల ఆచార వ్యవహారాలు. భాషా, వారి సాంఘిక కట్టుబాట్లను గురించి కూలంకషంగా పరిశీలనా, పరిశోధనా జరిపారు. ప్రపంచ పర్యటనలో టిబెట్, సింహాళం జపాన్, ఇరాన్, ఇరాక్, రష్యా ఇంగ్లాండ్ మొదలగు దేశాలు పర్యటించారు.

రాహుల్ సాంకృత్యాయన్ తన జీవన ప్రధమసోపానంలో దయానంద సరస్వతి పట్ల, ఆర్య సమాజ సిద్ధాంతాల పట్ల గొప్ప ఆకర్షితులయ్యారు. దయానంద విరచిత 'సత్యార్థ ప్రకాశిక''ను ప్రామాణిక గ్రంధంగా అంగీకరించి దానికనుగుణంగా నడుచుకున్నారు. ఆ తర్వాత బౌద్ధ త్రిపిటక, సిద్ధాంతాల పట్ల ఆకర్షితులయ్యారు. వాటిని ఎంతగానో ఆరాధించారు. బౌద్ధయుగం నాటి భారత దేశ చరిత్రను గురించి తాను తెలుసుకుని తన ఉపన్యాసాల ద్వారా, రచనల ద్వారా ప్రజలకు తెలియజేశారు. బుద్ధుని నీతి న్యాయసూత్రాలు, టిబెటన్, పాలీ, పైశాచీ భాషల్లో ఎన్నో వేలతాళ పత్ర గ్రంధాల్లో పొందుపరచబడి వున్నాయి. వాటన్నింటినీ అధ్యయనం చేసి అనువాద గ్రంధాల ద్వారా మనకందించిన మహోన్నతుడు. అంతకు మించిన ప్రతిభావంతుడు. అటుపిమ్మట కారల్‌మార్క్స్ అనుయాయిగా రూపొందారు. వీటితోపాటు దేశభక్తిపూరిత రాజకీయాలలోనూ చురుకుగా పాల్గొని ఐదేండ్లపాటు కారాగారవాసాన్నీ అనుభవించారు. జైలు జీవితంలో కూడా అధ్యయానాన్నీ, రచనా వ్యాసంగాన్నీ వదలిపెట్టలేదు. రెండువందలకు పైగా గ్రంధాలను రచించి ఈ ప్రపంచానికందించిన పుంభావ సరస్వతి రాహుల్ సాంకృత్యాయన్.

1893 వ సంవత్సరములో 9వ తేదీన ఉత్తరప్రదేశ్‌నందలి నిజామాబాద్ సమీపంలోని 'పందహో గ్రామంలో మాతామహుల ఇంట జన్మించారు. ఈ ప్రాంతం అజమ్‌గడ్ జిల్లాలోనిది. తండ్రి గ్రామం 'కనైలా'' బాల్యనామం కేదారనాథ్. కేదారనాథ్ మాతామహుల ఇంటి కడు గారాబంతో పెరుగుతూ మధ్య మధ్య తండ్రి ఇంటికి వెళ్లి వస్తూ వుండేవాడు. కేదారుని మాతామహులు ''రామశరణ్ పాఠక్'' వైష్ణవదీక్షాపరులు. అయినప్పటికీ ఆనాడు మహమ్మదీయులతో మంచి సంబంధాలను పెంచుకున్న వ్యక్తి.

ప్రాధమిక దశలో కౌదారునికి ఉర్దూ నేర్పించారు. అందరికీ ఏడాదిపట్టే చదువు ఇతనికి మూడు నెలలకే అవగతమయ్యేది. కేదారనాధుని తొమ్మిదేళ్ల వయసులో ఉపనయనం చేయటానికై వింధ్యాచలం బయలుదేరి మార్గమధ్యంలో కానీ పట్టణంలో ఆగినారు. తానొక్కడే బజారుకువెళ్లి పుస్తకాల దుకాణంలో ఐదారు పుస్తకాలు కొనితెచ్చుకున్నాడు. కొత్తప్రాంతం. అయినా ఒంటరిగా వెళ్లి కొన్న వస్తువులు పుస్తకాలు మాత్రమే. అప్పుడే ఆయన మనసులో సాహసోపేతమైన యాత్రలకు పునాదిపడిందని చెప్తారు. 1903వ సంవత్సరంలో కేదారనాధుడు మూడవతరగతి చదివాడు. ఆ తరగతి పాఠ్యపుస్తకంలో "మానవజీవితమూ, అందునా యవ్వనం మరల మరల రాదు. కాబట్టి ఇప్పుడే ప్రపంచ యాత్ర చెయ్యా" లనే వాక్యాలు వున్నవి. అవి ఆయన మనస్సుపైనా, భావిజీవితంపైనా చాలా గట్టి ముద్రవేశాయి. పదకొండేళ్ల వయస్సులోనే వివాహం జరిపించారు. కాని ఆ పెళ్ళికేమాత్రం బద్ధులు కాలేదు. బాల్యంలోనే తల్లిని కోల్పయారు. నిజామాబాద్ మిడిల్ స్కూల్‌లో చదివి 1907లో ఆరవతరగతి పూర్తి చేశారు. పర్యటనలకు ప్రారంభంగా కాశీ బయల్దేరి వెళ్ళారు. కాని ప్రయాణం ముందుకు సాగలేదు. ఆ తర్వాత మరలా ప్రయత్నించి కలకత్తా చేరారు. తిరిగి గ్రామం వచ్చి మిడిల్ పరీక్ష పూర్తి చేశారు. "ప్రపంచ పర్యటన చెయ్యి" అను మాటలు మాటి మాటికీ మనసులో మెదులుతున్నవి. మరలా కలకత్తా వెళ్లి రైల్వే స్టేషన్‌లో మార్కింగ్ వేసే పనిలో కుదురుకున్నారు. ఆ తర్వాత నస్యం దుకాణంలోనూ పని చేసి తృప్తి అనిపించక తండ్రి గ్రామమైన కైలా వచ్చేశారు. సమీపంలో వున్న పరమహంస కుటీరానికి వెళ్లి హిందీ టీకా వున్న సంస్కృత గ్రంధాల్ని అందునా వేదాంత గ్రంధాల్ని పఠించారు. మిగతా విషయాలన్నీ అధ్యయనం చెయ్యాలంటే సంస్కృతం నేర్చుకుని వుండాలి అన్న విషయం బోధపడింది. కమండలాన్ని చేతపట్టి కాలినడకనే ప్రయాణించారు. దారిలో సమీప గ్రామాల వాళ్లు ఇచ్చిన వస్తువులతో స్వయంపాకం చేసుకునేవారు. రాత్రిపూట ఏ సాధు కుటీరంలోనో తలదాచుకుంటూ అయోధ్యా పరిసరాలను దాటి క్లిష్టమైన హిమాలయ యాత్ర ప్రారంభించారు. అక్కడక్కడ భిక్షాటన చెయ్యటానికి కూడా వెనుకాడలేదు. కేదారనాథ్‌లో వుండి శివపురాణంలాంటి గ్రంధాలను పఠించారు. కేదారనాథ్, బదరీనాథ్, ఊషీ మఠ సందర్శన చేశారు. తిరిగి బరేలీప్రాంతానికి చేరుకోగానే ఇంటిలోని వారు పట్టుబట్టి స్వగ్రామం తీసుకొచ్చారు. "లఘు కౌముది"ని నేర్వనారంభించినారు. తిరిగేకాలు ఆగలేదు. బయలుదేరి వెళ్లి సారనాథ్ చేరారు. అక్కడి జైన విగ్రహాలను, పురతత్వ సంపదను ప్రపథమంగా దర్శించారు.

*మిగతా విషయాలన్నీ అధ్యయనం చెయ్యాలంటే సంస్కృతం నేర్చుకుని వుండాలి అన్న విషయం బోధపడింది. కమండలాన్ని చేతపట్టి కాలినడకనే ప్రయాణించారు. దారిలో సమీప గ్రామాల వాళ్లు ఇచ్చిన వస్తువులతో స్వయంపాకం చేసుకునేవారు.*

1911లో కాశీ చేరి విద్యాభ్యాసం కొనసాగించారు. వ్యాకరణం, వేదాలు మున్నగు విషయాలను సంస్కృతంలో నేర్చుకోసాగారు. రఘువంశం, వాల్మీకి రామాయణం లాంటి సరళ కావ్యాలను శ్రద్ధగా చదువుతూ సంస్కృతభాషా జ్ఞానాన్ని పెంపొందించుకున్నారు. మనస్సును ఏకాగ్రంగా వుంచటానికై సాధన చేశారు. ఈ సమయంలోనే మంత్రతంత్రాలపై ఆసక్తి కలిగి అవీ నేర్చుకుని ప్రాణాలతో చెలగాటమాడి వాటిని విరమించుకున్నారు. 1912వ సంవత్సరంలో లఘు కౌముది ని పూర్తిచేసి ''సిద్ధాంతకౌముది''ని నేర్చుకోవటం ప్రారంభించారు. కావ్యాలు మాత్రం ఎక్కువగానే చదవటం పూర్తిచేశారు. హిందీ భాషను స్వయంగాను ఇంగ్లీషు భాషను వేరొకరి దగ్గర అభ్యసింపసాగారు. అప్పుడే ప్రారంభమైన దయానంద స్కూల్లో ఏడవ తరగతిలో చేరారు.

ఆ రోజుల్లో మఠాలకు, మఠాధిపతులకు చాలా ప్రాముఖ్యముండేది 'ఛప్రా' జిల్లాలో వున్న ''పర్సా'' మఠాధిపత్యాన్ని కేదారనాధుడు స్వీకరించవలసివచ్చింది. సాధువుగా మారారు. చాలా ఆదాయం వచ్చే మఠమది. సౌకర్యవంతమైన విలాసజీవితం గడిపే అవకాశం మఠాధిపతికున్నది. కాని కౌదారుని మనస్సులో విద్యాభ్యాసం, యాత్రసంకల్పాలకే ప్రాధాన్యమున్నది. కాబట్టి 'పర్సా' మఠం వదిలిపెట్టి మద్రాసు చేరారు. తిరుపతి, తిరుమ శిలను దర్శించారు. తిరుపతి చుట్టు ప్రక్కలున్న క్షేత్ర ప్రదర్శన పూర్తి కాగానే ద్వారకకు ప్రయాణమయ్యారు. దారిలో బెంగుళూరు, హంపీ శిధిలాలను సందర్శించారు. భారతదేశ చరిత్రను చదివి ఆకళింపు చేసుకున్నారు.

కాలినడకన అయోధ్య చేరి మరలా చదువు ప్రారంభించారు. స్వరసహితంగా సామ వేదాన్ని అభ్యసించారు.

ఆగ్రా విదాల్యయంలో వున్న కోర్సులో చేరారు. ఆ రెండేళ్ల కోర్సులో భాగంగా ఆర్యసమాజ సిద్ధాంతాలను గురించి శిక్షణ పొందారు. ఇక్కడే అస్పృశ్యుల సముద్ధరణ గురించి అవగతం చేసికున్నారు. ఆర్యసమాజ సంపర్కం వలన కేదారునిబుద్ధి బాగా వికసించింది.

రష్యా విప్లవాన్ని గురించి పత్రికల ద్వారా చదివి తెలుసుకువారు. ఆర్యసమాజ సిద్ధాంతాలను సామ్యవాదంతో సమన్వయ పరచటానికి ప్రయత్నించేవారు. కచ్చాన్ వ్యాకరణం ద్వారా సింహళ, బర్మాలిపులు నేర్చుకున్నారు.

1915వ సంవత్సరం నాటికి చదువులోనూ, ఉపన్యాసాలు ఇవ్వటంలోనూ బాగా తర్ఫీదు పొందారు. మతం అంటే ఆర్యసమాజమనీ, ఇంకా స్వామీదయానందుని వైదిక మతమేననీ కేదారుని అభిప్రాయం. ఆర్య సమాజమే సర్వోత్తమమైనదని బలంగా విశ్వసించారు. లాహోర్‌లోని డి.ఎ.ఐ కాలేజీలో సంస్కృత విశారద తరగతిలో చేరి అభ్యసింపసాగారు. ఆర్యసమాజ ప్రచార ఉపన్యాసాలను జాతీయ భావాలతో నింపి చెప్పేవారు. వీటిపై ప్రభుత్వ గూఢచారులు రిపోర్టులు పంపేవారు.

మహేశపురంలో వైదిక విద్యాలయాన్ని ప్రారంభించారు. ఇక్కడ వుండగానే రష్యా విప్లవాన్ని గురించి పత్రికల ద్వారా చదివి తెలుసుకువారు. ఆర్యసమాజ సిద్ధాంతాలను సామ్యవాదంతో సమన్వయ పరచటానికి ప్రయత్నించేవారు. కచ్చాన్ వ్యాకరణం ద్వారా సింహళ, బర్మాలిపులు నేర్చుకున్నారు.

లక్నోలోని బౌద్ధవిహారాన్ని దర్శించి స్వామీ బోధానందతో చర్చలు జరిపారు. జబల్‌పూర్ వెళ్లి 'వేద – మధ్యమ' పరీక్షవ్రాసి ఉత్తీర్ణులయ్యారు. ఈ రోజుల్లోనే రష్యా కార్మిక విప్లవ వార్తలు తెలుసుకోవటానికి చాలా ఆసక్తి కనపరచేవారు. వాదోపవాదాలు చేస్తూ తనదే పైచేయి అనిపించుకుంటూ వుండేవారు. అయోధ్య వచ్చి "శాస్త్రి" పరీక్షకు సిద్ధమయ్యారు. చైనా, జపాన్ దేశాలకు వెళ్లి వైదికమత ప్రచారం చేయాలని భావించేవారు. మరొకవంక గాంధీజీ ఉద్యమాల పట్ల ఆకర్షితులవుతూ వున్నారు.

కేదారనాధునిలో విద్యాదాహం పెరుగుతూనే వున్నది. కర్శీకి వచ్చి న్యాయ, మధ్యమ, మీమాంసం ప్రధమ పరీక్షలకు కూర్చోదలచారు. జాతీయ ఉద్యమాల పట్ల నిబద్ధతతో వుండేవారు. జానకీ నగరంలోని రైతుల హక్కులను కాపాడి రైతుల మనసులకు దగ్గరయ్యారు.

ఒకవైపు చదువు. మరొక వైపు యాత్ర సంకల్పం రెండింటికీ సమాన ప్రాధాన్యం ఇస్తూ ప్రయాణిస్తున్నారు.

తులసీ రామాయణాన్ని, వేదాంత భాష్య హస్తలిఖిత ప్రతులను చిత్రకూట సమీపంలో చూశారు. ముజఫ్ఫర్ జిల్లా, నలందా మ్యూజియమ్, బోధగయ, బెంగాల్, బీహారు సందర్శించారు. మరొకసారి దక్షిణభారత యాత్రనూ చేశారు. ఆర్యసమాజ సిద్ధాంతాలకు దగ్గరగా వుందని "రామానుజ ద్వైత సిద్ధాంతాన్ని" "అష్టాదవరహస్యాలను" పఠించారు. మైసూర్ వెళ్లి అక్కడి ప్రజల జీవితాన్ని అధ్యయనం చేశారు.

సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని ఛప్రా జిల్లాలో పర్యటిస్తూ ప్రజలను మేల్కొలిపే ప్రయత్నంలో అరెస్టు కావింపబడ్డారు. నేరారోపణ అంగీకరించిన ఫలితంగా జైలు జీవితం గడిపారు. అక్కడే "బోల్షివిజం – ప్రపంచ శాంతి" అనే గ్రంధాన్ని చదివారు. సంస్కృత భాషలో గ్రంధరచన ప్రారంభించారు.

గయలో బౌద్ధుల మహా సభ జరిగింది. బౌద్ధ భిక్షువులు పాళీ, ఇంగ్లీషు, సంస్కృత భాషల్లో ఇచ్చిన ఉపన్యాసాలన్నింటినీ అనువదించారు. ఇక్కడే "అనంతభాష జ్ఞుడని" కీర్తింపబడ్డారు.

కాలినడకనే, నేపాలుకు బయలుదేరారు. అతికష్టమైన అటవీమార్గం గుండా ప్రయాణం చేసి రాక్సాల్ చేరుకున్నారు.

పాట్నా సభలో ఉపన్యసించటం వలన బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసి పాట్నా జైలులోనే వుంచింది. అక్కడి జైలరు ప్రోత్సాహంతో "భారతదేశ చరిత్ర" వ్రాయటం ప్రారంభించారు. అంతకు ముందుటి జైలు జీవితంలో కురాన్ పాఠాన్ని సంస్కృతంలో వ్రాశారు. ఇపుడు దానికి హిందీ అనువాదాన్ని పూర్తి చేశారు. తర్వాత హజారీబాగ్ జైలుకు మారారు. సింహళ లిపిలో వున్న పాళీ "మఝ్ఝినికాయ్" అనే బౌద్ధమతగ్రంధాన్ని దగ్గరే వుంచుకునేవారు.

జైలులో తోటివారికి గణిత విద్య నేర్పించేవారు. ఇక్కడే "ఇరవై రెండో శతాబ్దం" అనే గ్రంధ రచన ప్రారంభించారు. అంతేకాక ఒక ఇంగ్లీషు పుస్తక ఆధారంగా బాలల కోసం కథారూపంగా జ్యోతిష్యాన్ని గురించి ఒక చిన్న పుస్తకం ఆ తర్వాత విశిష్టమైన బృహత్ జ్యోతిష్య గ్రంధరచన, ఖగోళ చిత్రాల తయారీని రూపొందించారు. విశేషమేమిటంటే ఖగోళ చిత్రాల తయారీలో అప్పటివరకూ లభ్యం కాని నక్షత్ర మండలాల పేర్లను ఆయన సృష్టించారు. ఇంగ్లీషులో నక్షత్రాల లెక్కింపును గ్రీకు అక్షరాలుపయోగించి చేశారు. కాని కేదారనాధుడు బ్రాహ్మ అక్షరాలుపయోగి నక్షత్రాల లెక్కింపును తెలియజేస్తూ సృజించిన

గొప్ప అనువాద రచనే "గణిత జ్యోతిష్య గ్రంథం" "బంగారు డాలు" అనే పేరుతో నాలుగు సాహసోపేత యాత్రలకు సంబంధించిన హిందీ అనువాదాలు చేశారు. ఈ హజారీబాగ్ జైలులోనే ఆర్యసమాజ భావాల స్థానే బౌద్ధమత సిద్ధాంతాలు ఆకర్షింపసాగినాయి. జైలు నుండి విడుదలయ్యి జిల్లా కాంగ్రెసు ఉపాధ్యక్ష పదవిని స్వీకరించారు. కాని రాజకీయాలలో తృప్తి పొందలేక మరలా పర్యటనలు మొదలుపెట్టారు. మీరట్ నుండి ప్రారంభించి ఢిల్లీ, ఎర్రకోట, లాహోర్, కైలురు కనుమయాత్రను పూర్తి చేశారు. అపుడే విదేశీ పర్యటనల కోసం దరఖాస్తు పెట్టుకున్నారు. శ్రీనగర్ , లడఖ్, కర్గిల్ హోమిస్‌లను సందర్శించారు. కొన్నికొన్ని ప్రాంతాలలో నాల్గుకాళ్ల జంతువు వలె పాకుతూ "ఖర్గోంగ్" కనుమ యాత్రను పూర్తి చేశారు.

**తన బుద్ధినే మార్గదర్శకంగా ఎంచుకుని ముందుకు సాగారు డార్విన్ పరిణామ వాదం, మార్క్సిజంలోని సత్యం ఆయన హృదయానికి హత్తుకుని పోయినవి.**

బౌద్ధమతాన్ని గురించి నూతన విషయాలు తెలుసుకునే అన్వేషణలో పడ్డారు. బౌద్ధలామాలను కలుసుకుని చర్చలు మొదలుపెట్టారు. ఒక స్త్రీ, బహుభర్తలను పెళ్లాడే సంప్రదాయాన్ని విరమింపచేయాలని లామాలకు సూచించారు. పశ్చిమ హిమాలయ యాత్రకు సిద్ధపడ్డారు. "మన్‌పంగ్ శాంగక్ష" అనే సరస్సునూ, "యాక్"పశువుల మందనూ చూశారు. పశ్చిమ టిబెట్‌లో ప్రవేశించి రెండురోజులు గడిపారు.

తర్వాత ఛప్రా ప్రాంతం వచ్చి రాజకీయ సమావేశంలో పాల్గొన్నారు. తాను వెలిబుచ్చే సామ్యవాద భావాలు సమాజంలో ఎక్కడా కనపడక నిరాశ చెందారు. క్రీ.శ. 1927 లో లంకకు వెళ్లారు. 'విద్యాలంకార విహారం"లో సంస్కృతం బోధించటానికి పూనుకున్నారు. పంతొమ్మిది నెలల కాలం అధ్యయనం అధ్యాపక కృషి సల్పుతూ వుండిపోయారు. ఏ విశ్వ విద్యాలయంలోనూ చదవకుండా భారతీయ సంస్కృతిని, అపారజ్ఞానాన్ని సముపార్జించారని జర్మనీ ప్రొఫెసర్ "రుడాల్ఫ్ వోటో" ప్రశంసించారు.

తెప్పవలె ఒడ్డున చేర్పించటానికై నీకు ధర్మోపదేశం చేశాను. దాన్ని నెత్తిమీద మోసుకుని తిరగటానికి కాదు" అనే బుద్ధుని వాక్యం వీరి మనస్సును ఎంతగానో ఆకట్టుకున్నది. లంకలో నివసించినపుడు వీరు రామోదారస్వామి అని పిలువబడ్డారు. ఆ రామోదారస్వామికి తన గోత్రమైన సాంకృత్యాయన్ జోడించి రామోదార సాంకృత్యాయన్ అనే పేరు పెట్టుకున్నారు. ఆ తర్వాత బౌద్ధమత దీక్ష పొందేటప్పుడు రామోదార పేరును రాహుల్" గా మార్చుకున్నారు. ఆనాటి నుంచి "రాహుల్ సాంకృత్యాయన్"గా ప్రసిద్ధి పొందారు ఎల్లప్పుడూ స్వయంగానే ఒక నిర్ణయానికి రావాలని బుద్ధుడు ఇచ్చిన సందేశం రాహుల్జీని మేల్కొలిపింది. తన బుద్ధినే మార్గదర్శకంగా ఎంచుకుని ముందుకు సాగారు డార్విన్ పరిణామవాదం, మార్క్సిజంలోని సత్యం ఆయన హృదయానికి హత్తుకుని పోయినవి.

లంకలో వున్నప్పుడు ప్రతి ఆదివారం కొలంబో వెళ్లి రాయల్ ఏషియాటిక్ సొసైటీ గ్రంథాలయంలో చదువుకుంటూ గడిపేవారు. ఈ సమయంలోనే రాహుల్జీ సాహిత్యజీవితం ఆరంభమయింది. హిందీ పత్రికలకు వ్యాసాలు వ్రాయటం ప్రారంభించారు. ఇక్కడే ఫ్రెంచ్, టిబెట్ భాషలను, నేర్చుకున్నారు. 1928 సెప్టెంబరు మూడవ తేదీన "త్రిపిటకాచార్య" అనే బిరుదును పొందారు. ఎన్నో గ్రంధాలను సేకరించుకుని భారత దేశానికి తిరుగుప్రయాణమయ్యారు. ఈ ప్రయాణంలో కార్లే, నాసిక్, అజంతా, ఎల్లోరా, ఔరంగాబాద్ గుహలనూ సాంచీ, కనోజి ప్రాంతాలనూ దర్శించారు.

రాహుల్జీ రచించిన "అభిధర్మకోష్" ను కాశీ విద్యాపీఠం ప్రచురించింది. నేపాల్ వెళ్లి అజ్ఞాత జీవితం గడిపారు. ఈ అజ్ఞాత జీవితంలోనే ఇంగ్లీషు ద్వారా టిబెట్ భాషను నేర్చుకున్నారు. "డాక్సా" లామా సహాయంతో టిబెట్‌లో ప్రవేశించారు. గౌరీశంకర శిఖర సందర్శన చేశారు. రాజధాని లాసా చేరుకుని, భుషింగ్‌షాలో వుంటూ తన అధ్యయన కార్యక్రమాన్ని ప్రారంభించారు. కలంలో సిరా కూడా గడ్డకట్టి పోయే పరిస్థితులలో వుంటూ కూడా భోట్ - సంస్కృత కోశం తయారు చేయటానికి పూనుకున్నారు. పదివేల సంస్కృత గ్రంథాలు భోట్ భాషలోకి అనువదింపబడ్డాయని తెలుసుకుని ఆనందించారు. కాని ప్రస్తుతం సంస్కృతానికి తగ్గిన ఆధిపత్యాన్ని గుర్తించారు. పురాతన మఠమైన సమ్.యేను.అందులో వున్న ప్రఖ్యాత తత్వవేత్త శాంతి రక్షితుని కపాలాన్ని దర్శించి శ్రద్ధాంజలి అర్పించారు.

బుద్ధవచనాల అనువాదమైన "కంజూర్ గ్రంధాన్ని, శాస్త్రాను వాదమైన "తంజూర్" లాంటి అపురూప గ్రంధాలను సేకరించుకున్నారు. టిబెట్‌లో గాంధీజీని సిద్ధ పద్మసంభవు"ని అవతార మని టిబెట్ భిక్షువులు భావిస్తున్నారని గ్రహించారు.

టిబెట్ నుంచి అపురూప గ్రంధాలు సేకరించి 18 కంచర గాడిదలపై వేసుకుని భారతదేశం పంపించారు. అక్కడి నుంచి వాటిని లంకకు చేర్చాలని ప్రయత్నించి వాటితోపాటు తానూ లంక చేరుకున్నారు. టిబెట్ యాత్రను గురించి వీరు వ్రాసే వ్యాసాలు ప్రజలు ఎంతో ఆసక్తితో చదివేవారు. వీరు హిందీలో రచించిన తొలిగ్రంధం "బుద్ధచర్య" దీనిని పూర్తిచేసి మరలా భారతదేశం తిరిగివచ్చారు. సత్యాగ్రహ ఉద్యమాల్లో పాల్గొన్నారు. ప్రజల్ని సోషలిజం వైపుకు మళ్లించటానికి బీహార్ సోషలిస్టు పార్టీని స్థాపించారు. కరాచీలు జరిగిన కాంగ్రెసు మహాసభలో పాల్గొన్నారు. మరలాయాత్రలు ప్రారంభించి హరప్పా, మొహంజదారోలను దర్శించారు. పిమ్మట మూడవపర్యాయం లంక ప్రయాణమయ్యారు. చైనా లిపిని నేర్చుకోవటం ప్రారంభించారు. "ధర్మపాలుడు" దేశ విదేశాలలో బౌద్ధ ధర్మప్రచారం కోసం "మహా బోధిసభ" ను ప్రారంభించాడు. ఈ సభ ప్రచారకర్తగా వుండి రాహుల్జీ యూరప్ పర్యటించారు. మార్సెబుల్స్ ప్యారిస్‌లోని విశ్వవిద్యాలయాన్ని అందలి తత్వవేత్తలను కలుసుకున్నారు. లండన్ చేరారు. లండన్‌లో వుండగా ఆయన కమ్యూనిస్టు సాహిత్యాన్ని ముఖ్యంగా రష్యా పుస్తకాలను, పత్రికలను చదివేవారు. కారల్‌మార్క్స్ సమాధిని దర్శించి శ్రద్ధగా పువ్వులు సమర్పించారు. లండన్ నుంచి ఫ్రాన్స్ వెళ్లారు. తాను వచ్చింది ప్రచారకర్తగా కాబట్టి బౌద్ధసభల్లో ఉపన్యసిస్తూ వుండేవారు. జర్మనీ పర్యటించారు. తర్వాత బెర్లిన్ చేరుకుని రష్యా వెళ్లే ఏర్పాట్లు చేసుకున్నారు కాని వీలు పడలేదు. తిరిగి లంకకే చేరుకున్నారు. లంక నుండి భారతదేశం వచ్చారు. గిల్‌గిల్, లడక్‌ల ప్రయాణం పెట్టుకున్నారు. టిబెట్ సాహిత్యవేత్త అయిన "జోసెఫ్‌గెర్గన్"ను కలిసి మాట్లాడారు. "ధమ్మపదాన్ని" సంస్కృతంలోకి అనువదించారు. "మర్జుమనికాయ" మంతటినీ అనువదించే ప్రయత్నం చేపట్టారు. లాహోర్ ప్రాంతంలో టిబెట్ భాషలో వున్న "కర్మశతక" అనే పురాతన హస్తలిఖిత ప్రతిని కనుగొన్నారు. నాసిక్‌లో బ్రాహ్మీలిపిలో వున్న అనేక శిలాఫలకాలను చదివారు. పర్యటన మధ్యమధ్యన మహాబోధి సభ, ఇతరుల ఆర్థిక సహాయంతో తన పుస్తకాలను అచ్చువేయిస్తూ వుండేవారు. ప్రయాగలోని భూకంపబాధితులకు పరిచర్యలు చేసి క్రీ.శ. 1934 మార్చి20 తేదిన పాట్నా నుండి కాలింగ్‌పాంగ్ బయలుదేరారు. "యూనాన్‌త్సాంగ్" అనువదించిన "విజ్ఞప్తి మాత్రతా సిద్ధి"లోని ప్రతి శబ్దాన్ని సేకరించి సంస్కృతంలోకి అనువదించటం ప్రారంభించారు. "టిబెట్‌లో పదిహేను నెలలు" అనే పుస్తకాన్ని ముద్రించారు. "వినయ్ పిటక్" ను హిందీలోకి అనువదించటం మొదలుపెట్టారు.

**_టిబెట్ నుంచి అపురూప గ్రంధాలు సేకరించి 18 కంచర గాడిదలపై వేసుకుని భారతదేశం పంపించారు. అక్కడి నుంచి వాటిని లంకకు చేర్చాలని ప్రయత్నించి వాటితోపాటు తానూ లంక చేరుకున్నారు._**

కంచరగాడిదల మీద, కొన్నిచోట్ల పడవలెక్కి ప్రయాణించి మరలా టిబెట్ రాజధాని లాసా చేరుకున్నారు. టిబెట్‌లో ప్రాచీన భారతీయ సంస్కృత గ్రంధశోధనే ఇప్పుడు రాహుల్జీ ప్రధాన ఆశయం. తత్వకౌముది, ప్రజ్ఞాదీపావళి, కంజూర్ బృహత్‌గ్రంధం, వాదన్యాయ మూలగ్రంధం" ఇలా లభించిన వాటినన్నీ అచ్చువేయించారు. అచ్చువనే కాక ప్రసిద్ధసాహిత్యకారుల్నీ, తత్వవేత్తలనూ అన్వేషించి వారిని కలుసుకుని చర్చిస్తూ వుండేవారు. 'గే-షే ధర్మవర్ధన్ లాంటి ప్రముఖులను కలుసుకుని ఎన్నో విషయాలు తెలుసుకునేవారు. "శత సాహస్రిక" ప్రతిని సంపాదించి పాట్నా మ్యూజియమ్‌లో భద్రపరిచారు. ప్రాచీన గ్రంధాల కోసం కాలినడకనే తిరుగుతూ ఎక్కడ విహారాలుంటే అక్కడికి వెళ్లి వేయి సంవత్సరాలనాడు చిత్రించిన చిత్రాలనూ దర్శించి అబ్బురపడేవారు. "బౌద్ధన్యాయా"నికి సంబంధించిన గ్రంధాలను వార్తకాలం కారం" లాంటి ముఖ్యగ్రంధాలను చూసి పరవశించేవారు. నేపాల్, ఖాట్మండూల గుండా భారతదేశం తిరిగి వచ్చారు. టిబెట్ చిత్రకళను, భారతీయ చిత్రకళతో పోలుస్తూ వ్యాసాలు వ్రాశారు.

రంగూన్ కౌలాలంపూర్, సింగపూర్, హాంకాంగ్‌లలో పర్యటిస్తూ ఉపన్యసిస్తూ జపాన్‌కు ఓడలో బయలుదేరారు. జపాన్ భాషను నేర్వసాగారు. జపాన్‌లోని బౌద్ధవిహారాలు, రైతుజీవితం మున్నగువాటిని అధ్యయనం చేశారు. రైలు ప్రయాణంలో రష్యా చేరుకున్నారు. ప్రసిద్ధ స్థలాల్నీ, దేవనాగరి లిపిలో వున్న పన్నెండు శిలాశాసనాల్ని దర్శించి ఇరాన్ బయలుదేరారు. ఉమర్‌ఖయ్యాం, ఫిరదౌసి సమాధుల్ని దర్శించి నివాళులర్పించి వెనుదిరిగారు. భారతదేశం వచ్చిన తర్వాత "దీర్ఘనికాయం "జపాన్ వాదన్యాయం" ప్రచురించారు. తీరని జ్ఞానదాహంతో మరోసారి "టిబెట్ వెళ్లారు" "సాక్య" విహారంలో అపూర్వమైన గ్రంధ సంపద లభిస్తే పొంగిపోయారు. వీలైనన్ని ఎత్తి వ్రాసుకున్నారు. కొన్నింటిని ఫొటోలు తీసుకున్నారు. "మధ్యమక హృదయ" 'విగ్రహ వ్యావర్తిని - నాగార్జునాచార్యుడు "క్షణభంగాధ్యాయ"ను

కాపీ చేసుకున్నారు. వసుబంధుని "అభిధర్మకోశ భాష్యం" పూర్తి ప్రతి సంపాదించారు. "తర్క రహస్యం, వాదరహస్యం తదితర వాటిని కూడా సేకరించారు.

***1944 మార్చి ఆరవ తేదిన విజయవాడకు బయలుదేరి వచ్చారు. 14, 15 తేదీలలో లక్షమందికి పైగా హాజరయిన అఖిల భారత రైతు మహాసభలలో రాహుల్జీ పాల్గొన్నారు. సుప్రసిద్ధ కళా విమర్శకులు సంజీవ్‌దేవ్‌తో కలిసి ధాన్య కటకం సందర్శించారు.***

గాంధీజీ, నెహ్రూజీ లాంటి వారి సమక్షంలో తనకు సాఫీగా ఊపిరి ఆడదని రాహుల్జీ, భావించి వారి సమక్షానికి వెళ్లటానికి ఉత్సకత చూపేవారు కాదు. పాట్నాలో వుండి గాంధీవాదం, కమ్యూనిజం, జమీందారీ వ్యవస్థలపై వ్యాసాలు వ్రాసి పత్రికలకు పంపేవారు.

1937 సెప్టెంబరు 17వ తేదీన ఢిల్లీ నుండి బయలుదేరి ఓడలో సోవియట్ అకాడమీ తరుపున డా॥ స్చేర్వావస్కీ ఆహ్వానం మీద రష్యా వెళ్లారు. లెనిన్‌గ్రాడ్ బౌద్ధ విహారాధ్యక్షుడు డా॥ స్చేర్యావస్కీ, ఇండో టిబెట్ శాఖ కార్యదర్శి లోల. ఆమె రాహుల్జీ దగ్గర సంస్కృతం నేర్చుకుని తాను రష్యన్ భాష నేర్పింది. భోట్-రష్యన్ శబ్దకోశం తయారు చేస్తున్నది. బౌద్ధ న్యాయ గ్రంథాలను యూరోపియన్ భాషలలోకి అనువదించాలని రాహుల్జీని విహారాధ్యక్షుడు పిలిపించాడు. రష్యా విప్లవ వ్యతిరేక కుట్రల వలన అకాడెమీ రాహుల్జీకి ఏ నిర్ణయమూ తెలియజెయ్యలేదు. లోలను మాత్రం అర్ధాంగిగా స్వీకరించి రాహుల్జీ భారతదేశం తిరిగి వెళ్లారు. తర్వాత ఆఫ్ఘనిస్తాన్, కాబూల్, షాంగిర్డ్, పెషావర్, సారనాథ్‌లను దర్శించారు. మరోసారి టిబెట్ వెళ్లారు. జ్ఞానశ్రీ రచనలు 1220 ప్రాంతంలో భారతదేశ నలందా విషయాల్ని తెలిపే చిత్రపటాలూ, సిద్ధుల రాతిబొమ్మల్నీ ఫొటోలు తీసుకుని తిరిగి వచ్చారు.

భారతదేశ రైతు మహాసభల పట్ల ఆసక్తిని కన్పరిచేవారు. రాజేంద్రప్రసాద్‌తో దీని విషయమై చర్చించేవారు. సభల్లో చురుగ్గా పాల్గొనేవారు. సోషలిస్టు పార్టీ సభ్యత్వాన్ని తీసుకున్నారు. రైతు సత్యాగ్రహంలో పాల్గొని లాఠీ దెబ్బల్ని తిన్నారు. ఈ సత్యాగ్రహ కారణంగా జైలు జీవితమనుభవించారు. ఇక్కడే వుండి 'జీవించటం కోసం' అనే నవల పూర్తి చేశారు. తన తలపై లాఠీతో కొట్టిన వ్యక్తిని విడిచిపెట్టమని కోరి తన ఔదార్యాన్ని చాటుకున్నారు. 1939వ సంవత్సరంలో జరిగిన భారత కమ్యూనిస్టు సమావేశానికి బీహారు రాష్ట్ర ప్రతినిధిగా రాహుల్ పాల్గొని అక్కడ వున్న ఎంతోమంది కమ్యూనిస్టుల్ని చూసి సంతోషపడ్డారు. వ్యక్తిగత జీవితం కంటె సమిష్టి జీవితం గొప్పదన్న సిద్ధాంతం లోగడ పరిచయమైన మహాత్ముల, పండితుల ద్వారా గ్రహించారు. కమ్యూనిస్టులలో గూడా ఇదే సిద్ధాంతం రాహుల్జీకి కనిపించింది. ఈ పార్టీ సభ్యత్వమే తనకు గొప్ప గౌరవమని భావించారు. అజ్ఞాతవాసం గడిపినప్పుడు సోవియట్ రష్యా కమ్యూనిస్టు పార్టీ చరిత్రను హిందీలోకి అనువదించారు. 1940 సంవత్సరంలో భారత రక్షణ చట్టం క్రింద అరెస్టు గావించబడి మలాకా జైలులో ఇరవైతొమ్మిది నెలలు వుంచబడ్డారు. ఈ కాలంలో పదునాలుగు పుస్తకాలు వ్రాశారు. తత్వ శాస్త్రాన్ని గురించి ఇచ్చిన ఉపన్యాసాలు 'దర్శన్ – దిగ్దర్శన్' వంటి ఉద్గ్రంథం వ్రాయటానికి తోడ్పడ్డాయి. బొంబాయి వెళ్ళి కమ్యూనిస్టు కార్యాలయంలో మకాంపెట్టి కొన్ని పుస్తకాలను అనువదించారు. కార్మిక నాయక జీవిత చరిత్రలూ లిఖించారు. 'నయే భారత్ కే నయే నేతా' గ్రంథంలో ముఖ్యులైన నలభై ఇద్దరి జీవిత చరిత్రలను పొందుపరిచారు. 'వోల్గాసే గంగ' చాలా ప్రసిద్ధి పొందిన రచన. 'హేతుబిందు' టిబెట్ అనువాదాన్ని సంస్కృతీకరించారు. 'సంబంధపరీక్ష' నూ ఇలాగే చేశారు. 'వార్తికాలంకారం' 18 వేల శ్లోకాల విస్తృత గ్రంధం. దానిని టిబెట్ అనువాదంతో సరిపోల్చి మూడు పెద్ద సంపుటాలుగా తయారుచేశారు. ఆంధ్రులు మట్టితో గాదు, ఉక్కుతో తయారయినవారు. కాబట్టి ఉత్తర భారతాన్ని పరిపాలించిన రాజులు ఆంధ్రలో పాగా వెయ్యలేకపోయారు. ఆంధ్రుల ఆత్మబలిదానంతో హృదయం ద్రవించిన చండ అశోకుడు ధర్మ అశోకుడుగా మారాడు. ధాన్యకటక, శ్రీ పర్వత సుందర మూర్తులు ఆంధ్ర శిల్పుల అమరకృతులు. ప్రపంచంలోనే అద్భుత కళ వీరిది. ఇవి రాహుల్జీ అభిప్రాయాలు. ఇలాంటి అభిప్రాయాలతో 1944 మార్చి ఆరవ తేదిన విజయవాడకు బయలుదేరి వచ్చారు. 14, 15 తేదీలలో లక్షమందికి పైగా హాజరయిన అఖిల భారత రైతు మహాసభలలో రాహుల్జీ పాల్గొన్నారు. సుప్రసిద్ధ కళా విమర్శకులు సంజీవ్‌దేవ్‌తో కలిసి ధాన్య కటకం సందర్శించారు. తాంత్రిక బౌద్ధ వాదులకు ఇది అన్నిటికంటె పెద్ద తీర్థ స్థలం. దీనిపేరు మీదనే టిబెట్‌లు 'డే పుంగ్' మఠం స్థాపించబడింది. డే పుంగ్ అంటే ధాన్య కటకం. ధాన్యరాశి అని అర్థం. బుద్ధుడు తంత్రమార్గంలో ప్రథమ ఉపదేశం ఇక్కడే ఇచ్చాడు అని చెప్తూ వుంటారు. అమరావతి

## ఉగాది పిలుపు

- కొల్లూరు మురళీ కుమారి
9963744104



ఇక్కడ కవులు
కవితలు కలబోసుకుంటున్నారు
ఆలోచనకు అందని మెదడుతో
పాత భావాలకు రంగులద్ది
శిథిల దేహానికి
నూతన వస్త్రం తొడిగి
నటించే ఆత్మలా
నర్తించే దేహంలా
హేలా హలానికి
అడ్డుకట్ట తీస్తున్నారు
నూతన శకం చూసి
భయపడతారు
అంతరాత్మ గూర్చి
వల్లిస్తారు
అంతర్మధనాన్ని
వదిలేస్తారు
బూజు దులపాల్సిన
అవసరం వచ్చింది
భుజం భుజం కలపాల్సిన
కాలం వచ్చింది
శిథిల పునాది నుంచి
నూతన రూపం తెచ్చుకుందాం
పూత పూసినట్లు
కొమ్మ రెమ్మ విరగ గాసినట్లు
నూతన వాసనలు వెదజల్లుదాం
నూతన వసంతాలు పూయిద్దాం
మహోన్నత విలువల్ని అందిద్దాం
మనకు కావలసింది
భావుకతకాదు
భావావేశం

❋

---

కళ ఒక స్వతంత్ర కళా సంప్రదాయం అంటూ ఆ విశిష్టతను తెలియజేశారు. శ్రీ పర్వతం ఆశ్చర్య వార్తా సహస్రుల ఉద్యమ స్థానమనీ, అక్కడి చమత్కారాల ప్రతిధ్వని అనేక సంస్కృత కావ్యాలలో వినబడుతుందని చెప్పారు. నాగార్జునుని 'సుహృల్లేఖా' పత్రం నేటికీ, టిబెట్, చైనా భాషానువాదాలతో సురక్షితంగా ఉన్నదని చెప్తున్నారు.

సర్దార్ పృథ్వీసింగ్ జీవిత చరిత్రను వ్రాశారు. 'హిందీ కావ్యధార' ద్వారా నలభై అయిదు మంది పైగా కవుల రచనలను పరిశీలించి ఆ సారాంశాన్ని పాఠకులకందించారు.

'సింహ సేనాపతి' అనే నవల ద్వారా బుద్ధుని కాలంనాటి ప్రజాతంత్ర రాజ్యాలను పరిచయం చేశారు. 'జయియాధేయి' రచన ద్వారా సముద్ర చంద్ర గుప్త కాలం నాటి విశేషాలను తెలియజేశారు. ఆ తర్వాత 'పలాయనం వద్దు, పరివర్తన చేయి' అనే పుస్తకం వ్రాశారు. "నా జీవనయాత్ర'ను 1940లో మొదలుపెట్టి 1944 వరకు వ్రాసి వుంచారు. మరొక పర్యాయం రష్యా వెళ్ళి వచ్చారు. కమ్యూనిస్టు పార్టీ దృక్పథం నచ్చక పార్టీ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు. హిమాచల ప్రదేశ్‌లో మూడు నెలలు గడిపి అక్కడి ప్రాచీన సంస్కృతిని అవగతం చేసుకున్నారు. ఆ అనుభవాలను 'కిన్నెర దేశంలో' అనే పేరుతో ఒక బృహద్గ్రంథం రచించారు.

చైనాయాత్ర, మరొకసారి లంక ప్రయాణం చేసి, మధ్య ఆసియా చరిత్రను రెండు సంపుటాలుగా రచించారు. దీనికి కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారాన్నిచ్చారు.

మరలా కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని తీసుకున్నారు. కారల్‌మార్క్స్, లెనిన్, స్టాలిన్, మావోసేటుంగ్ జీవిత చరిత్రలను రాశారు. 1963లో వీరికి భారత ప్రభుత్వం 'పద్మభూషణ్' బిరుదునిచ్చింది. కాశీ విద్యాపీఠం 'మహాపండిత' బిరుదునిచ్చింది. తనతోపాటు ఇంకెందరినో యాత్రికులను తయారుచేయనెంచి 'ఘుమక్కడ్ శాస్త్రం' విశ్వకీ రూప్ రేఖా' అనే శాస్త్రీయ గ్రంథాన్ని ఆవిష్కరించారు.

1963వ సంవత్సరంలోనే వీరికి అనారోగ్యం తీవ్రమయింది. సోవియట్ రష్యా ప్రభుత్వం చికిత్స నందించింది. లంక విశ్వవిద్యాలయంలో పనిచేసినప్పుడు కలిగిన మెదడు జబ్బే తీవ్రతరమైంది. ఆ తీవ్రత తగ్గించటానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా లాభం లేకపోయింది. తను సంపాదించిన విజ్ఞానాన్నంతా తన రచనల ద్వారా ప్రజల కందించి తాను అమరులయ్యారు. డార్జిలింగ్‌లో తన తుది శ్వాస విడిచారు.

***'మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాన్' అనే పుస్తక రచయిత బండ్ల పల్లె ఓబులరెడ్డి. 1963లో రాశారు. ఆ మహోన్నత మానవుణ్ణి గురించి ఈనాటి పాఠకులకు తెలియజేయాలన్న వుద్దేశ్యంతో వారి పుస్తకం చదివి ఈ సమీక్ష వ్రాశాను.***

❋

**కవిత**

# చూపుడు వేలి కొసన సూర్యోదయం



- బెందాళం క్రిష్ణారావు
7306434888

ఊరిచివర పూరి గుడిసెలో
చావలేక బతుకుతూ
బతకడానికి చస్తూ
జీవమున్న శవంలా
నీళ్లెండిన కళ్లతో
కడజాతి వాడినని తనలో తానే
ముడుచుకుపోతూ అతడు

అసమ సమాజ నిచ్చెనమెట్లు
ఎక్కాలని ఎన్ని సార్లు
ప్రయత్నించినా
కూలబడిపోతున్నాడు
ఇదో మెట్టుపైనే

తన జీవితమంతా ఇంతేనా?
అని కన్నీటి వ్యథతో అతనుంటే

నీ కష్టాలు గట్టెక్కడానికి
అల్లానే నమ్ముకోవాలని
అతనే దయామయుడని
నమాజు చేస్తే చాలని
స్వర్గానికి తీసుకువెళ్తాడని
చెప్పారతనికి ముఫ్తీలు-

లేదు..లేదు...
అల్లా కన్నా యేసే గొప్పని
ఆయనే దేవుని పుత్రుడని
ప్రార్థనలు చేస్తే చాలు
పాపాలన్నీ ప్రక్షాళన చేసేసి
అతడే స్వర్గానికి తీసుకుపోతాడని
ప్రభువు సన్నిధిలో
అంతా ఆనందమేనని
బోధనలు చేసారు ఫాదరీలు

కాదు...కాదు...
యజ్ఞయాగాదులు చేస్తేనే
మోక్షం కలుగుతుందని
స్వర్గ సుఖాలు సంప్రాప్తిస్తాయని
అక్కడ అందమైన అప్సరసలతో
నిత్యం శృంగార సంగమం
నిరంతరం సోమ సురాపానం
ఆనందం...పరమానందం...అని
అంటున్నారు కాషాయస్వాములు
అంతేకాదు...
తామే అందరికన్నా గొప్పని
వారికైతే ఒక్కో దేవుడు మాత్రమే
మాకైతే ముప్పైమూడు కోట్ల దేవుళ్లు
ఉన్నారని...ఒకరు కాకపోతే
మరొకరైనా కరుణిస్తారని
ప్రభోధిస్తున్నారు కంగారొద్దని

వీళ్లంతా అతన్ని
ఎక్కడో ఉందో లేదో తెలియని
స్వర్గానికి పంపిస్తామనే
హామీ ఇస్తున్నారుగానీ
ఈ భూమ్మీద కష్టాల ఊబినుంచి
కన్నీళ్ల కాసారంలాంటి బతుకు నుంచి
కాపాడుతామని మాత్రం
చెప్పడమే లేదు
ఇంకా-
మోక్షం పొందడానికి అయ్యే
ఖర్చులనీ, పుణ్యమనీ కాజేస్తున్నారు
అతడు స్వేదం చిందించి
సంపాదించిన దాన్నే...

జీవితమే ఒక వేదనగా
నిరుపేదరికమే చిహ్నంగా
తనకు రోజుగడిస్తే చాలు
సమాజంలో వెలివేయకుండా
బతకడానికి రోజూ పనిదొరికి
ఆకలిమంటలు చల్లారితే
అదే పదివేలు...

ఇంతలోనే-
అతనికి కలిగిందో సందేహం
'స్వర్గం సుఖాలగురించి
చెబుతున్న వీరంతా
అక్కడికే వెళ్లకుండా
తనలాంటి శ్రమ జీవులను
మూఢత్వంలో ఉంచి
ఎందుకు దోపిడీ చేస్తున్నారా...?' అని

అప్పుడే ఆ గుడిసెలోకి
చిరువెలుగులు చొరబడుతున్నాయి
అతడు ఆశ్చర్యంగా
బయటకు వెళ్లి చూస్తే
కూడలిలో ఉన్న బాబాసాహెబ్
చూపుడు వేలి కొసన
సూర్యోదయమౌతోంది

❋

# నాటక సాహిత్య సజీవనది శ్రీశ్రీ



- డా॥ కె.జి. వేణు
9848070084

*రేడియో మాధ్యమానికి తగిన విధంగా మాటల పొదుపుతో, ఆసక్తికరమైన సన్నివేశాలతో, శ్రోతలను మైమరపించే మాటలతో, రచనకు సాంకేతిక విలువలు జోడించి ఆయన జరిపిన ప్రయోగాలన్నీ ఒక జీవనది ప్రవాహంలా సాగిపోతాయి. ఈ నాటికల అవసరం అప్పటికే కాదు, ఇప్పటికీ వుందనిపిస్తూ వుంటుంది. మనిషికి, మనిషికీ మధ్య ఆకాశం ఎత్తుదాకా బిగించబడిన ఇనుప తెరల్ని క్షేధించటమే ధ్యేయంగా ఈ నాటికలు సాగిపోతాయి.*

**శ్రీశ్రీ** మహాకవి మాత్రమే కాదు. గొప్ప నాటక కర్త కూడా. నాటక శాస్త్రాన్ని, నాటక తత్వాన్ని, నాటక ప్రయోజనాన్ని సంపూర్ణంగా ఆకలింపుచేసుకొని, నాటక అస్తిత్వాన్ని అపూర్వంగా ఆవిష్కరించిన గొప్ప మేధావి శ్రీశ్రీ. ఆయన కలం నుంచి జాలువారిన 1+1=1 సంపుటిలోని అన్ని నాటికలు ఆణిముత్యాలే. ఈ నాటికలలోని ఇతివృత్తాలన్నీ సాధారణ ప్రజల జీవితాలతో ముడిపడి వున్న కథాంశాలు మాత్రమే. కథ, కథనం, శిల్పం, సన్నివేశాలు, సంభాషణలు, సందేశాలు.. ఏవీ కూడా కృత్రిమంగా కనిపించవు. అన్నీ సజీవ స్వరూపాలే. మెదళ్ళకు కదలిక కలిగించే మేను పర్వతాలే. ఈ సంపుటిలోని నాటికలు అత్యధికం రేడియో నాటికలే. రేడియో మాధ్యమానికి తగిన విధంగా మాటల పొదుపుతో, ఆసక్తికరమైన సన్నివేశాలతో, శ్రోతలను మైమరపించే మాటలతో, రచనకు సాంకేతిక విలువలు జోడించి ఆయన జరిపిన ప్రయోగాలన్నీ ఒక జీవనది ప్రవాహంలా సాగిపోతాయి. ఈ నాటికల అవసరం అప్పటికే కాదు, ఇప్పటికీ వుందనిపిస్తూ వుంటుంది. మనిషికి, మనిషికీ మధ్య ఆకాశం ఎత్తుదాకా బిగించబడిన ఇనుప తెరల్ని క్షేధించటమే ధ్యేయంగా ఈ నాటికలు సాగిపోతాయి.

నాటికల ప్రారంభమే ఆసక్తిని, సరిక్రొత్త ఆలోచనల్ని మనకు కలిగిస్తాయి. 'బలి' నాటిక ప్రారంభంలోనే రాక్షసరాజు 'బలిచక్రవర్తి', దేవతల రాజు 'ఇంద్రుడు' వీరిద్దరి మధ్యనున్న పోలికల మీద ఆసక్తికరమైన చర్చ సాగుతుంది. బలిచక్రవర్తి రాక్షసుల రాజు అయినప్పటికీ అతడు ఎంతో ధర్మమూర్తి, దాన పరాయణుడు, ప్రజలు మెచ్చిన పాలకుడు, సర్వశాస్త్రాల నియమాలను ఎపుడూ ఉల్లంఘించిన దాఖలాలు లేని స్వచ్ఛమైన జీవితాన్ని సొంతం చేసుకున్న చరిత్ర ప్రసిద్ధుడు. తన్ను అర్థింప వచ్చిన వామనుడికి తన సర్వస్వం అర్పించి పురాణ, ఇతిహాసాలలో 'తనకు తానే సాటి' అని నిరూపించుకున్న మేటి చక్రవర్తి అతడు. మరి ఇంద్రుడు అందుకు పూర్తిగా విరుద్ధం. దేవతల రాజయిన ఈయన దుష్టులలో దుష్టుడు. అతని అసూయకు మితిలేదు. తన పదవి నిలుపుకోవటానికి ఎంతటి నీచమైన పద్ధతులైనా అవలంభిస్తాడు. ఇంద్రుడు భోగలాలసుడు. మునిపత్ని అహల్యను చెరచటానికి సైతం సంకోచింపని వాడు. వెరసి ఇంద్రుడు మహా పాపాత్ముడు. అయినా అతడు స్వర్గానికి రాజు. ఇదేం నీతి? ఇలాంటి వాడికి రాజు పదవి ఎలా దక్కింది? అంటూ నాటికలో ఒక పాత్ర

ప్రవేశిస్తుంది. ఈ నాటిక చదివిన తరువాత ఈ దేశంలో పాలకులంతా ఇంద్రుడి వారసులేమోననిపిస్తుంది.

వ్యంగ్యానికి పెద్దపీట వేసిన నాటిక 'జడభరతుడు'. నాటకరంగంలో 'స్వగతం' అన్న ప్రక్రియ అతి ప్రాచీనమైన ఒక సాంప్రదాయం. దశవిధ రూపకాలలో ప్రముఖ స్థానం పొందిన స్వగతంతో పాటు, 'విష్కంభం', ఈహామృగం' లాంటి వాటి ప్రస్తావనలు కూడా ఈ నాటికలో చోటుచేసుకున్నాయి. దీనిద్వారా భరతముని నాట్యశాస్త్రాన్ని శ్రీశ్రీ ఎంతలోతుగా అధ్యయనం చేశారో అర్థమవుతుంది. రాజ్యాలు ఏవైనా, పాలించే రాజులు ఎవరైనా కష్టజీవికి కష్టాలు మాత్రం నిరంతరం వెంట తరుముతూ బాధిస్తూనే వుంటాయన్న సత్యాన్ని ఒక సన్నివేశం ద్వారా వివరిస్తాడు శ్రీశ్రీ. రామాయణ కాలంలో కూడా వెట్టి చాకిరి ఎంత భయంకరంగా వుందో, గస్తీ తిరిగే ఒక కాపలావాడి పాత్ర ద్వారా తెలియజేస్తాడు. "పదేళ్ళుగా రాత్రి, పగలు కాపలా కాస్తున్నాను. నాలుగేళ్ళయ్యింది పెళ్ళి చేసుకొని, భార్యని సంసారానికి తీసుకెళ్ళమని నా అత్త, మామలు పోరు పెడుతున్నారు. నేనేం చేసేది?" అంటూ బాధపడతాడు కాపలావాడు.

పాశ్చాత్య నాటకరంగ రీతుల్ని సంపూర్ణంగా జీర్ణించుకున్న మహామేధావి శ్రీశ్రీ. నాటికలో ఒక పాత్రకు సంభాషణలేవీ లేకుండా, ఆ పాత్రను అతిముఖ్య పాత్రగా మలిచి నాటిక నిండా నడిపించటం ఒక గొప్ప టెక్నిక్. దీనిని మొదట ప్రవేశపెట్టిన వాడు 'స్ట్రింగ్‌బర్గ్' నాటక రచయిత. ఇదే టెక్నిక్‌ని శ్రీశ్రీ కూడా 'జడభరతుడు' పాత్రలో ప్రవేశపెట్టి సఫలీకృతుడయ్యాడు. ఈ నాటికలో కాలగమనానికి శ్రీశ్రీ వాడిన టెక్నిక్ కూడా చాలా గొప్పది. కావలివాడు అరిచే అరుపును బట్టి ఆ రాతిరి ఎన్ని జాములు గడిచిందో తెలుస్తుంది.

యుద్ధం ఎపుడు జరిగినా అది సర్వనాశనాన్నే కోరుకుంటుంది. ఇదే విషయాన్ని చాలా సూటిగా ఆవిష్కరిస్తూ రాసిన నాటిక "యుద్ధం.. యుద్ధం...యుద్ధం..". మహాభారత సంగ్రామాన్ని నేపథ్యంగా తీసుకుని మరణించిన వీరుల రక్తాన్ని త్రాగుతున్న రాక్షసులు, శవాల మాంసాలను ఇష్టంగా భోంచేస్తున్న రాబందుల సంభాషణల ద్వారా యుద్ధాన్ని కోరుకుంటున్న సామ్రాజ్యవాదుల నైజాలను బట్టబయలు చేస్తాడు శ్రీశ్రీ. సమాజ శ్రేయస్సు కోసం కనిపెట్టిన యంత్రం

*విషయాన్ని నేరుగా చెప్పకుండా పాఠకుడిలో ఆసక్తిని రేపుతూ సన్నివేశాల రూపంలో అందించే టెక్నిక్ శ్రీశ్రీ నాటికల్లో చాలాచోట్ల మనకు కనిపిస్తుంది.*

పెట్టుబడిదారుల చేతుల్లోకి వెళుతోంది. దీనివలన ప్రజాస్వామ్యానికి విజ్ఞానం కలిగించటం బదులు వారిని దోచుకోవటానికి ఈ యంత్రం ఒక ఆయుధంగా ఎలా పనిచేస్తుందో వివరించిన నాటిక 'చెప్పని సందేశం'.

1945లోనే రైతుల కడగండ్లను గురించి కన్నీరు కార్చిన ప్రజారచయిత శ్రీశ్రీ. 'భాగ్యలక్ష్మి' అనే నాటికలో ప్రాచీన కళారూపమైన యక్షగానాన్ని సైతం సమర్ధనీయంగా సమన్వయ పరచిన శ్రీశ్రీ నాటక చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోతాడు. ఈ యక్షగానంలో అద్భుతమైన భావసంపద తొణికిసలాడుతుంది. "బక్కచిక్కిన దుక్కిటెద్దుల ప్రాణములు కనుగొనల దాగెను", "ఆకసము రక్తాన్ని కుండము, భూమి నల్లని బొగ్గుకుంపటి మండు గాడుపు టెండవేడికి.." అంటూ "మరిగి కాలం ఖణేల్మన్నది, ఇనుప గంటలు నవ్వినట్లుగా, దిగుడు బావి దిగాలుగానున్నది.." అంటూ యక్షగానాన్ని కొనసాగిస్తూ చివరగా పేదలపట్ల భాగ్యవంతుల నిర్ణయాన్ని ఇలా ప్రకటిస్తాడు. "పేదవాళ్ళందరూ సుఖంగానే వున్నారని, భాగ్యవంతులు ఏకగ్రీవంగా నిర్ణయం చేశారు. గొప్ప గొప్ప వారందరికి జయం.. వారి చుట్టూ తిరిగే వారికందరికి జయం.... పేదవాళ్ళకెందుకు భయం! ప్రాణమున్నన్నాళ్ళు బ్రతుకుతారు నయం.." అంటూ యక్షగానం పూర్తవుతుంది. **Rudyard Kipling** రాసిన **The Masque of plenty** శ్రీశ్రీ చేసిన యథాశక్తి తర్జుమా ఈ నాటిక.

విషయాన్ని నేరుగా చెప్పకుండా పాఠకుడిలో ఆసక్తిని రేపుతూ సన్నివేశాల రూపంలో అందించే టెక్నిక్ శ్రీశ్రీ నాటికల్లో చాలాచోట్ల మనకు కనిపిస్తుంది. 'ఒంటరి బావి' నాటికలో బావిలో శవమై పోయిన అసిరిగాడి బిడ్డను గురించి చెబుతూ "అమాయకురాలి భయంకరపు అరుపు ఆఖరిసారి విన్నారు ప్రజలు, బిడ్డను ఎవరు చంపేశారు, ఎంతో అందమైన పిల్ల, ఎందుకు చంపేశారు?.. అంటూ పేదలంతా ప్రశ్నిస్తారు. ఒక కూలీవాడి అందమైన కూతురు అప్పటికీ, ఇప్పటికీ ఎందుకు చంపబడుతుందో, ఎవరిచేత చంపబడుతుందో, ధనమదం ఇనుప రెక్కల డేగల కామం ఎందరి కన్నెపిల్లలను నాశనం చేస్తుందో పొరలు, పొరలుగా వర్తమాన నిజాలు ఈ నాటిక చదువుతున్న పాఠకుడి కళ్ళముందు నిలుస్తాయి.

అనన్య సామాన్యంగా సాగిన నాటిక 'ముట్టడి'. ఇందులో విశేషమేమిటంటే నాటకకర్త సృష్టించిన పాత్రలే నాటకకర్తని ముట్టడిస్తాయ్. ఇలాంటి క్రొత్త ప్రయోగాలను ఏ నాటక రచయిత చేపట్టలేదు. ఈ నాటికలో అంతర్నాటకమైన 'కాలేజి కనకతార' మనల్ని చాలా ఆలోచింపచేస్తుంది. ఒక దృశ్యం పగలుకు, మరో దృశ్యం రాత్రికి కేటాయించి నాటికను నడిపించిన తీరు నాటకరంగానికి ఒక పెద్ద సిలబస్‌గా నిలిచి పోతుంది. సామాన్య నాటకాల్లో కనిపించే అవాస్తవిక ధోరణుల్ని ఎండగడతాడు ఈ నాటికలో శ్రీశ్రీ. రంగస్థలం మీద పాత్ర చనిపోయి, ఒన్స్‌మోర్ అనగానే తిరిగి పైకిలేచి పద్యం చదివే సన్నివేశం కేవలం హాస్యం కోసమే ఆయన సృష్టించలేదు. చాలా ప్రదర్శనల్లో చోటు చేసుకుంటున్న ఇలాంటి దృశ్యాలను వెక్కిరించటానికే రాసినట్లుగా వుంటుంది.

*ఒక దృశ్యం పగలుకు, మరో దృశ్యం రాత్రికి కేటాయించి నాటికను నడిపించిన తీరు నాటకరంగానికి ఒక పెద్ద సిలబస్‌గా నిలిచి పోతుంది.*

ఈ సంపుటి నాటికల్లో పాఠకుడి మెదడులో వేడి పుట్టించే నాటిక 'శిరస్సు చెప్పిన రహస్యం'. ఈ రచన నిండా ఎన్నో కళాత్మక విలువలు చోటుచేసుకున్నాయి. ఇందులోని పాత్రలన్నీ ప్రయోగాత్మకంగా వుంటాయి. మరికొన్ని సింబాలిక్‌గా కొనసాగుతాయి. సన్నివేశాలన్నీ మనిషి ఆలోచనలకు ప్రతిరూపాలుగా నిలుస్తాయి. ఈ నాటికలో ఒక శిల్పి అసంపూర్ణంగా మలిచిన శిరస్సు చెప్పిన రహస్యాలు ఎన్నో వాస్తవికతలకు అద్దం పడతాయి. నిద్రకు, చావుకు మధ్యనున్న తేడా ఈ నాటికలో గొప్పగా చర్చించబడుతుంది. ఈ నాటికలో 'నగ్న దరిద్రం' అన్న తైలవర్ణ చిత్రాన్ని అద్భుతంగా చిత్రీకరిస్తాడు ఒక చిత్రకారుడు. కాని చిత్రకళా ప్రదర్శనలో ఆ చిత్రాన్ని ప్రదర్శించటానికి ప్రదర్శన నిర్వాహకులు వొప్పుకోరు. కారణం ఆ చిత్రాన్ని ప్రజలు చూస్తే, ఉత్తేజితులై ప్రభుత్వం మీద తిరగబడతారని భయపడతారు. ధన దాహానికి దాసోహమైపోతే కళ ఎలా భ్రష్టుపట్టి పోతుందో చాలా దృశ్యాల్లో శ్రీశ్రీ వివరిస్తాడు.

ప్రతి మనిషిలోనూ అంతర్లీనంగా వుండే వివిధ రకాల భయాలను, ఆశలను, సమగ్రంగా, ఆసక్తికరంగా చిత్రీకరించిన నాటిక 'గుమస్తా కల'. కోనేటి రాత్రి కథనే ఈ నాటికగా మలిచాడు శ్రీశ్రీ. జీవితంలో తీరని కోరికల్ని స్వప్నంలో తీర్చుకుంటాడు సగటు మనిషి. అంటే అతి సామాన్య కోరికలను సైతం తీర్చుకోలేని దుర్భర పరిస్థితుల్లో సగటు మనిషి ఎలా జీవిస్తున్నాడో ఈ నాటిక తెలియజేస్తుంది. ఈ నాటికలో 'వెల్టాన్ షాంగ్ డెర్ వుంటర్ డెన్ లెండెన్! గెస్టాల్ట్ డెర్ డాయిష్లాండ్ వూబర్ ఆర్ప్...'' అంటూ జర్మనీ భాషను కూడా పరిచయం చేస్తాడు శ్రీశ్రీ. ప్రపంచ భాషలతో శ్రీశ్రీకి ఉన్న సాన్నిహిత్యం దీని ద్వారా అర్థమవుతుంది.

ఏ నాటికకైనా ఫెడిన్, ఫెడవుట్‌లు చాలా ముఖ్య మైనవి. వీటి ప్రయోగం మీదే నాటక ప్రదర్శన విజయం ఆధారపడి వుంటుంది. దీన్ని అతి లోతుగా పరిశీలించిన వ్యక్తి శ్రీశ్రీ. ఈయన నాటకరంగ విజ్ఞానం ఎంత ఉన్నత స్థాయిలో వుందో తెలియజేసే నాటిక 'గవేషణ'. 'స్వర్గమనీ, నరకమనీ మరో లోకంలో లేవు... నీ పాపమే నీ నరకం, నీ పుణ్యమే నీ స్వర్గం...'' అని ఒక పాత్ర చేత చెప్పిస్తాడు. న్యాయస్థానాలలో జరిగే పొరపాట్లను, పోలీసు వ్యవస్థలో పునరావృతమవుతున్న అన్యాయాలను, అమాయకుల ఆర్తనాదాలను హృదయాలను కదిలించేలా ఈ నాటికలో చిత్రీకరిస్తాడు. ఆఫీసుల్లో పనిచేసే ఉద్యోగస్తుల పనితీరును, ఆసుపత్రులు నడుస్తున్న నరకాలుగా సామాన్య ప్రజల్ని ఎలా బాధిస్తున్నాయో ఈ నాటిక తెలియజేస్తుంది.

విషయాన్ని సూటిగా అందించటం కోసం, నిజాన్ని ప్రజలందరూ ఆలోచించటం కోసం శ్రీశ్రీ ప్రయోగించిన వ్యంగ్య, హాస్య ధోరణి కదంత్రొక్కిన నాటిక 'కొక్కొరోకో'. ఇందులో పాస్‌పోర్టుల జారీ సన్నివేశం ప్రభుత్వ వైఖరిని బట్టబయలు చేస్తుంది. సేవకుడు వచ్చి 'పాసుపోర్టు దరఖాస్తులు దొర! చైనా దేశానికి...'' అంటాడు. అధికారి ఉలిక్కి పడతాడు. ''చైనా దేశానికి పాస్‌పోర్టులు ఇవ్వటం అస్సలు వీల్లేదంటాడు. ఆ దేశాన్ని సందర్శిస్తే మన దేశానికి వచ్చే ముప్పేమిటో ఏకరువు పెడతాడు. కుబేర దేశానికి సంబంధించిన అన్ని పాస్‌పోర్టుల మీద సంతకం పెట్టేస్తాడు. పైగా ఆ దేశం గొప్పతనం గురించి కథలు, కథలుగా చెప్తాడు. ''జాగ్రఫీ ప్రకారం చూస్తే సరిగ్గా మన కాళ్ల క్రింద వుంటుంది ఆ దేశం..'' అంటాడు అధికారి. అందుకు స్పందించిన సేవకుడు ''వుండేది మన కాళ్ల క్రిందనే... కానీ కూచోడం మన నెత్తిమీద..'' అంటూ చురక అంటిస్తాడు. పెట్టుబడిదారీ వర్గానికి కొమ్ముకాస్తున్న పత్రికల్ని కూడా శ్రీశ్రీ ఈ నాటికలో వదిలిపెట్టలేదు.

# మానవత్వం




- డా॥ ఎన్. గోపి

ఆ సమావేశంలోంచి
బయటికి రాంగనే
మనుష్యులందరూ
దోపిడీదారుల్లాగే కనబడుతున్నారు.
'రాజకీయం లేనిదెక్కడ?'
అన్నాడు మిత్రుడు.

భావజాలం అదే
కాని సందర్భం మారింది
పదజాలమూ పాతదే
కర్తలు తడబడుతుంటాయి.
కాకపోతే క్రియలు
కొత్త విశేషణాల్ని మోస్తుంటాయి.

చరిత్ర నవ్వుతుంది
అప్పుడప్పుడది
బాంబులా పేలుతుంది కూడా.
వృద్ధాప్యం, రోగాలు
కొత్తభాషలో మాట్లాడుతుంటాయి.
మాల్స్, మల్టీప్లెక్స్‌లు, మెట్రోలు
మొబైల్ ఫోన్లు, సెటిలైట్లు
ప్రపంచీకరణ ద్వారానికి
తోరణాల్లా వేలాడుతుంటాయి.

ఇవి జీవిత కథలనే కాదు
సన్నివేశాలనూ
సంవిధానాన్నీ
ప్రయోజనాన్నీ మార్చేస్తాయి.

కార్టూన్ నెట్‌వర్క్‌లో
కదిలే బొమ్మల్లో మనమే వుంటాము.
గతంలో
బాల సాహిత్యకారులు
తల్లి హృదయంతో రాసేవాళ్లు
అద్భుత రసానికి
వాత్సల్యాన్ని జోడించేవాళ్లు
ఇప్పుడు పిల్లలను
వర్తమాన శ్రుతుల్లోకి కుక్కేస్తున్నారు.

కార్టూన్ నెట్‌వర్క్‌లో
తరుములాట ప్రారంభమౌతుంది

'రాజకీయం లేనిదెక్కడ'
ప్రశ్న మళ్లీ మొదటికొస్తుంది.
'మానవత్వంలో కూడా
రాజకీయముంది'
అన్నాడు ఒక మహామేధావి.
అవును కొత్త రాజకీయం
అందరికీ అంటుకుంటుంది.

❋

---

శ్రీశ్రీ రచించి, అచ్చుకాని నాటకం 'బెండయ్యగారి గది'. ఇది 1+1=1 సంపుటిలో అచ్చయింది. శ్రీశ్రీ ఎంతో ఇష్టపడి రాసిన నాటకం ఇది. తన మనసులోని సంఘర్షణంతా ఈ నాటకం రూపంలోకి తీసుకొచ్చాడు శ్రీశ్రీ. ఈ నాటకాన్ని మూడు అంకాలతో ముక్తసరిగా రాశాడు. 'బెండయ్యగారి గదికి మూడు గోడలు... నాలుగవ గోడ ప్రేక్షకులే అంటాడు శ్రీశ్రీ. ఈ నాటికలో మన చుట్టూవున్న ఎందరో మనుష్యుల ప్రతిబింబాలు మనకు కనిపిస్తాయి. దుర్భర పరిస్థితుల్ని సృష్టిస్తున్న పరాన్న జీవులు, ఆ పరాన్నజీవులకు కాపుకాస్తున్న ప్రజావ్యతిరేక వర్గం... మనముందు ఈ నాటకంలో కదలాడుతారు.

ఈ నాటికలో ప్రస్తావించవలసిన నాటికలు ఇంకా చాలా వున్నాయి. కవిగా శ్రీశ్రీ ఎన్ని శిఖరాలు అధిరోహించారో.. అందుకు సమానంగా శ్రీశ్రీని నాటకకర్తగా నిలబెట్టిన నాటికలు ఇవి. ఈ నాటికలన్నింటిని ఒక **Intellectual** నాటికలుగా తీర్చిదిద్దాడు ఆయన. సామాన్య రచయితలు ఇలాంటి నాటికలను రాయలేరు. ఈ నాటికలలో శ్రీశ్రీ ఒక గొప్ప ఆలోచనాపరుడిగా, ఒక గొప్ప తత్వవేత్తగా, ఒక నాటక శాస్త్రవేత్తగా కనిపిస్తాడు. అంతుపట్టని కాలం, దూరం, స్వర్గం, నరకంల గురించి ఆసక్తికరమైన చర్చ ఈ నాటికల్లో మనకు దొరుకుతుంది. ఈ నాటికల మీద సమగ్రమైన పరిశోధనలే కాదు, ఈ నాటికల ప్రదర్శనలు కూడా వూరూరా జరగవలసిన అవసరం ఎంతో వుంది. కవిత్వానికే కాదు, నాటకరంగానికి సైతం యుగకర్త శ్రీశ్రీ!.

❋

# మనిషి చిన్నబోతున్నాడు

- ఎరుకలపూడి గోపీనాథరావు

9848293119



సృష్టిలో నలుసంతైన భూమండలాన్ని
నానా దేశాలుగా విభజించి
సరిహద్దుల లోలోపల సంకోచించుకుపోతున్న మనుష్యులను చూసి
విగడియ విగడియకూ విస్తరిస్తున్న విశ్వం విస్మయం చెందుతున్నది!
మానవ దురాక్రమణలు తమను కూడా పంచుకుంటాయేమోనని
ఇతర గ్రహాలు కూడా ఇహపరాల గురించి ఆలోచిస్తున్నాయి!
మేరలూ, పొలిమేరలూ స్వేచ్ఛగా దాటేస్తూ
మహీతలమంతటా మనఃపూర్వకంగా పర్యటించే
ప్రాణవాయు వీచికల ఆత్మోన్నత్యాల వైశాల్యాల ముందు
స్వార్థ చింతనల కట్టడల కంచెలు కట్టుకుంటున్న మనిషి చాలా చిన్నబోతున్నాడు!
నిరంతరాయంగా అక్షాంశరేఖాంశాలనధిగమిస్తూ
జీవజలవాహినులై ప్రపంచమంతటా పరిభ్రమించే
వానమబ్బుల విశిష్టగుణ విశాలత్వం ముందు
మనిషి ఇఱుకిఱుకు చిత్తం చివికి చివికి చిన్నబోతున్నది!
బుద్బుదప్రాయులైన భూజనులు
వాటాలు వాటాలుగా తమను విభాగించుకుంటూ
ఎల్లలేర్పఱచుకుంటూ తమపై ఏలుబడి సాగించడం చూసి
అపారపారావార తరంగాలు ఎగతాళిగా హసిస్తూ ఎగసి ఎగసి పడుతున్నాయి!
వసుధైక కుటుంబ భావనను వ్యాప్తిచేస్తూ
సప్త సముద్రాలగుండా స్వతంత్రయాత్రలు చేస్తున్న జలచరాల ముందు
గిరిగీసుకుని బ్రతుకుతున్న మనిషి చింత్యనీయంగా చిన్నబోతున్నాడు!
వారి వారి రాజ్యవిస్తీర్ణానికి తగినట్లు కేటాయించుకుంటూ
అహర్నిశలూ తనపై పెత్తనం చేస్తున్న మనుజులను చూసి
అనంతాకాశం నర్మగర్భంగా నవ్వుకుంటున్నది!
ఏ నిరంకుశ నియమాల నిర్బంధాలూ లేకుండా
విశ్వగీతికలాలపిస్తూ విహాయసమంతటా హాయిగా విహరించే విహంగాలముందు
ఆధునిక మానవుని భౌతిక పురోభివృద్ధి నిలువెల్లా చిన్నబోతున్నది!
సాధ్యమేననుకొనివుంటే - సూర్యచంద్రుల వెలుగులను కూడా
సామర్థ్యానికి తగినట్లు పంచుకునే ప్రణాళికలు రచించేవాడు మానవుడు...
నక్షత్రాలనూ లెక్కించి పంపకాలకు పావులు కదిపేవాడు నరుడు.....
అనవరతం తమ అండదండలతో జీవిస్తూ
తమ మీదే ఆధిపత్యం వహించాలనుకునే మనిషి వృథాప్రయాస చూసి
పంచతత్వాలు పరిహసిస్తున్నాయి!
ఏ దేశమేగినా ఒకేలా పరిమళించే పువ్వుల సాక్షిగా..
ఒకేలా ఫలించే తరువుల సాక్షిగా
విశ్వమానవునిలా ఎదగలేకపోతున్న మనిషి తనముందు తానే చిన్నబోతున్నాడు!

❋

# పడుగు పేకల కలనేత కవి శీలావీర్రాజు

- డాక్టర్ రాధేయ
9985171411



*కవిగా, చిత్రకారుడిగా, కథారచయితగా, నవలాకారుడిగా, వివిధ ప్రక్రియల్లోనూ ప్రతిభామూర్తులు శీలావీర్రాజు. ఇటువంటి గొప్ప ప్రతిభామూర్తిని, ప్రయోగవాదిని, విజ్ఞులైనవారు, విమర్శకులు పెద్దగా పట్టించుకున్న దాఖలాలు నాకు కన్పించలేదని చెప్పాలి. కవిత్వంలో కథాకావ్యాల్లో, వస్తుశిల్పాల్లో వీర్రాజు ప్రదర్శించిన ప్రతిభాపాటవాలు సామాన్యంకాదు. వారి సాహితీ వ్యక్తిత్వం స్ఫూర్తివంతంగా నిలుస్తుంది.*

*పరిశ్రమించి మనిషి గొప్ప రచయిత కాగలడు. కాని గొప్పమనిషి కాలేడు. రచయిత వ్యక్తిగా కూడా ఆదర్శప్రాయుడు కావాలి. శీలావీర్రాజు అటువంటి వ్యక్తి. రచయితకన్నా వ్యక్తిగా శీలావి మిన్న. ఆయన సాహిత్యం కూడా దీన్ని బలపరుస్తుంది. సాహిత్యంలోనేకాదు, వారి చిత్రకళలోనూ ఆయన వ్యక్తిత్వాన్ని గుర్తించవచ్చు. శీలావి సమాజానికి ఎదురీదుతూ తన్నుతాను కాపాడుకుంటూ తాను నమ్మిన జీవితానికి కట్టుబడి, ప్రగతిశీలతని నిలబెట్టుకున్నాడు.*

**– జయధీర్ తిరుమలరావు**

కొందరు ప్రతిభామూర్తులు కాలక్రమంలో పరిమళిస్తూ, తన ఉనికిని చాటుకుంటూ వుంటారు. మరికొందరు అదృష్టవంతులు అవకాశాలను ఊతంగా చేసుకొని ప్రకాశిస్తూ ఉంటారు. ప్రతిభామూర్తికి అదృష్టంతో అవసరంలేదు. అదృష్టవంతుడికి ప్రతిభాసామర్థ్యాలు ప్రధానం కాదు. వీరికి రాజకీయాలు, వ్యక్తిగతస్నేహాలు నిచ్చెనమెట్లుగా మారి అందలమెక్కిస్తాయి. ఈ క్రమంలో గొప్పగొప్ప మేధావులు, సాహితీవేత్తలు, రచయితలూ, కళాకారులూ మినహాయింపుకాదు.

కవిగా, చిత్రకారుడిగా, కథారచయితగా, నవలాకారుడిగా, వివిధ ప్రక్రియల్లోనూ ప్రతిభామూర్తులు శీలావీర్రాజు. ఇటువంటి గొప్ప ప్రతిభామూర్తిని, ప్రయోగవాదిని, విజ్ఞులైనవారు, విమర్శకులు పెద్దగా పట్టించుకున్న దాఖలాలు నాకు కన్పించలేదని చెప్పాలి. కవిత్వంలో కథాకావ్యాల్లో, వస్తుశిల్పాల్లో వీర్రాజు ప్రదర్శించిన ప్రతిభాపాటవాలు సామాన్యం కాదు. వారి సాహితీ వ్యక్తిత్వం స్ఫూర్తివంతంగా నిలుస్తుంది.

గోదావరి కవితా కలభాషిణి. ఆ నది ఒడ్డున నడయాడిన నన్నయ పద్యనాద మాధుర్యం శ్రీనాథవైభవ శృంగారం మరువలేనిది. మరపురానిది.

రాజరాజ నరేంద్రుని రాజ్యవైభవం చవిచూసింది గోదావరి రెడ్డి రాజుల ప్రజాహిత పాలనను తిలకించింది. గోదావరి నీళ్ళు దోసెడు తాగితే, కవిత్వం వస్తుంది. గొంతులో గాంధర్వశక్తి మేలుకొంటుంది అంటాడు ఒక కవి.

ఇది అక్షరాలా నిజమే!

ఈ గోదావరి ఒడ్డునే రాజమండ్రి నగరం.

రాజమండ్రి అంటేనే కవితానగరం.

చారిత్రక ప్రాధాన్యత కలిగిన నగరం.

ఆ రాజమండ్రి నగరంలో 1939లో చేనేత కార్మిక

దంపతులైన సూర్యనారాయణ, వీరభద్రమ్మ గార్లకు జన్మించారు వీర్రాజు. వారి తాతగారి కాలంలోనే విజయనగరం ప్రాంతం నుండి రాజమండ్రికి వలసవచ్చిన కుటుంబం వారిది.

పడుగుపేకల మధ్య ఆవిష్కృతమైన తన బతుకును తలపోస్తూ శీలావీర్రాజు తన మాటల్లోనే –

*"రంగెలిసిపోయిన*
*పురాచరిత్ర గోడు రాజమండ్రి పట్టణంలో*
*ఆసుకండెల పరుగులకీ*
*రాట్నం చక్రాల తిరుగులకీ*
*నేతమగ్గాల రాత్రింబవళ్ళ కదలికలకీ*
*నిలయమైన ఓ చిరుగుల చేనేతపేటలో*
*మంత్రసాని మరియమ్మ*
*ఈ భూమ్మీదికి లాకొచ్చినపుడు*
*వెల్తురు సూదులు గుచ్చుకున్న బాధతో*
*కళ్ళు చిట్లించి కేర్‌కేర్‌మని ఏడ్చిన*
*మట్టిరంగు ఒక్క ప్రాణిని*
*మరెవ్వరోకాదు నేనే"* అని

కవితా పరిచయం చేసుకున్నారు. తన బతుకు నేపథ్యాన్ని వివరించారు. దిగువ మధ్యతరగతి కుటుంబంలో వారి బాల్యం అమూల్యం కాదు. స్వేచ్ఛలేని బాల్యం చేజారిపోయింది. హైస్కూల్లో చదివేటప్పుడే వారిలోని చిత్రకళ పురివిప్పింది. అనుభూతులకు ప్రేరణనిచ్చింది. చిత్రకళ, సాహిత్యరంగాల్లో అభిరుచి కృషిగా మారింది. క్రమక్రమ వికాసం పొంది మొట్టమొదటి కథానికగా మారి 'రెండుజీవాలు' పేరుతో 'మాతృసేవ' అనే పత్రికలో అచ్చయింది.

ఇంటర్‌మీడియట్ చదువుతున్న రోజుల్లో (1955-57) రాసిన 'బ్రతుకుబాట' నవల 'ప్రజామత' పత్రికలో సీరియల్‌గా వచ్చింది. బి.ఏ. చదివే రోజుల్లో మరోనవల 'సహృదయులు' ఆంధ్రప్రభ వారపత్రికలో సీరియల్‌గా వచ్చింది. ఇలా తొలి రచనలు కల్పించిన ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగిపోయారు. వేసవికాలపు సెలవుల్లో దామెర్ల ఆర్ట్‌గ్యాలరీకి వెళ్ళి చిత్రలేఖనం నేర్చుకున్నారు.

1961లో ఉద్యోగరీత్యా వీర్రాజు హైదరాబాదు చేరుకున్నారు. హైదరాబాదులో 'నగ్నముని'తో పరిచయం ఏర్పడింది. మరికొంతమంది సాహితీమిత్రులు తోడయ్యారు. 1963లో 'మైనా' నవల రాశారు. మనం ఆరుద్రను ప్రయోగవాదిగా భావిస్తాం. వీర్రాజుకి కూడా ప్రయోగాలంటే చాలా ఇష్టం.

ఈ ప్రయోగాత్మక దృష్టితోనే వచన కవిత్వంలో కథను ప్రవేశపెట్టి 'కొడిగట్టిన సూర్యుడు' రాశారు. కుందుర్తిగారికి ఈ కథ ఎంతగానో నచ్చింది. వచన కవితలో కథాప్రక్రియ కావడంవల్ల ఈ 'కొడిగట్టిన సూర్యుడు' వచనకవితా సంపుటికి సరికొత్త ప్రయోగంగా మంచి గుర్తింపు వచ్చింది.

కుందుర్తి స్థాపించిన 'ఫ్రీవెర్స్‌ఫ్రంట్' బహుమతి మొట్టమొదటిసారిగా (1967) ఈ గ్రంథానికి వచ్చింది. 1969లో 'హృదయం దొరికింది' పేరుతో మరో కథలసంపుటిని వెలువరించారు. ఈ మార్గంలో ఈ ప్రయోగంలో తెలుగుకవితా లోకంలో వీర్రాజు స్థానం స్థిరపడింది. ఆ తర్వాత చాలాకాలం కథలు రాస్తూ వచ్చారు. ఆ రోజుల్లో యువభారతి సాహితీసంస్థవారు ప్రచురించే పుస్తకాలన్నిటికీ వీర్రాజు చేతనే ముఖచిత్రాలు వేయించుకొనేవారు.

వీర్రాజుగారిది ప్రేమవివాహం. తన మేనమామ కూతురు 'సుభద్రాదేవి'ని పెళ్ళి చేసుకున్నారు. సుభద్రాదేవి కుటుంబం కూడా సాహిత్యనేపథ్యం కల్గిందే కావటం వల్ల ఆమెకూడా రచయిత్రిగా మారింది. వివాహం తర్వాత వీర్రాజు కలం నిరాఘాటంగా ముందుకుసాగింది. అందుక్కారణం సుభద్రాదేవిగారేనని చెప్పాలి. ఒక గొప్ప కావ్యానికి అంకురార్పణ జరిగింది. అదే 'మళ్ళీవెలుగు' ఇది నగర జీవితాన్ని గురించి రాసిన ధ్వనికావ్యం.

1980లో 'కిటికీకన్ను' పేరుతో కవితాసంపుటి వెలువరించారు. పెళ్ళైన తర్వాత ఆయన రాసిన ప్రతిరచనకూ తొలి పాఠకురాలు, విమర్శకురాలు ఆయన శ్రీమతి సుభద్రాదేవిగారే.

ఇకపోతే – చిత్రకారులుగా వీర్రాజు దేశంలోని వివిధ ప్రసిద్ధ శిల్పకళా ప్రాంతాల్ని సందర్శించారు. అక్కడి శిల్పాలకు రేఖాచిత్రాలు వేసుకొని భద్రపరుచుకున్నారు. అజంతా, ఎల్లోరా, కోణార్క్, భువనేశ్వర్, బేలూరు, హళ్‌బేడు, శ్రావణ బెళగోళ, కంచి, మహాబలిపురం, ఆగ్రా, ఫతేపూర్, సిక్రీ మొదలైన రాష్ట్రేతర ప్రాంతాలేకాక లేపాక్షి, తాడిపత్రి, వరంగల్, రామప్ప, కాళహస్తి, నాగార్జునకొండ, సింహాచలం, వేములవాడ, కాళేశ్వరం, ఉండవల్లి, కొలనుపాక వంటి ప్రాంతాలు

దర్శించారు. 1990లో స్వచ్ఛంద పదవీవిరమణ చేశారు. తర్వాత చిత్రాలు గీస్తూ, కవితలు రాస్తూ పెయింటింగ్స్ వేస్తూ బిజీగా గడుపుతూ వచ్చారు.

వీర్రాజు కవిత్వానికి పరిమితమయ్యారు. అప్పుడప్పుడూ తాను రాసిన కథలన్నిటినీ కలిపి "శీలావీర్రాజు కథలు" అనే పేరుతో సంపుటిగా ప్రచురించారు. 1994లో 'ఎర్రడబ్బారైలు' అనే పేరుతో కవితా సంపుటిని వెలువరించారు. అయితే సాహిత్యపరంగా వీరు చేసిన కృషి కూడా ఎంతమాత్రం తక్కువ కాదు.

కుందుర్తి స్థాపించిన 'ఫ్రీవర్స్‌ఫ్రంట్' కార్యకలాపాల్ని 1982లో కుందుర్తి మరణించిన తర్వాత వారి కుమారుడు కుందుర్తి సత్యమూర్తి సహకారంతో కొనసాగిస్తూ వస్తున్నారు. అనేక వ్యాసాలు కూడా రాశారు. సమకాలీన రచయితలకు పీఠికలు రాశారు. అందర్నీ ప్రోత్సహిస్తూ ఆత్మీయుడిగా మెలిగారు. కవితా రచన ఆయన నిత్యవ్యాసంగం.

రచయితగా, కవిగా, చిత్రకారుడిగా ఆయన్నెరుగని కళాభిమానులు గానీ, సాహితీమిత్రులుగానీ అరుదు అంటే అతిశయోక్తి కాదంటాను నేను. ఆయన అనుభవంలోకి వచ్చిన ఏ అంశాన్నైనా తన రచనల్లో వ్యక్తంచేస్తూ వచ్చారు. ఆయన భావపరిణామం అంతా ఆయన సాహితీ ప్రస్థానంలోనే స్పష్టమవుతుంది.

తెలుగుసాహిత్యంలో ఒక ప్రత్యేకస్థానం సంతరించుకున్న వీరి గురించి డా॥ సంపతిబాల్‌రెడ్డి పరిశోధన చేసి తెలుగుసాహిత్య రుణం తీర్చుకున్నారనిపించింది నాకు. "శీలావీర్రాజు సాహిత్యం - వస్తురూపాలు" పేరుతో శీలావీర్రాజు జీవితాన్నీ, వ్యక్తిత్వాన్నీ, సాహిత్యనేపథ్యాన్నీ, నవల, కథా, కవిత్వం, వ్యాసం మొదలైన ప్రక్రియల్లో వారి ప్రతిభాసామర్థ్యాన్ని చక్కగా ఆవిష్కరించారు వారి పరిశోధనాంశంలో. ఇంత గొప్ప ప్రతిభామూర్తి సాహితీ వైవిధ్యాన్ని తెలుగు వారికి పరిచయం చేసిన డా॥ సంపతి బాల్‌రెడ్డిగారిని మన:పూర్వకంగా అభినందిస్తున్నాను.

నేను ప్రధానంగా కవిత్వాభిమానిని కాబట్టి కొంతలో కొంత శీలావీర్రాజు కవిత్వాన్ని ఇక్కడ విశ్లేషించే ప్రయత్నం చేస్తాను.

వీర్రాజు అందాన్ని ఆస్వాదించే భావుకులు. మొదటినుంచి ఆయనకున్న ప్రయోగ దృక్పథమే వారు కవిగా వెలుగు చూడటానికి దోహదపడిందని చెప్పవచ్చు. కాలేజి విద్యార్థిగా ఉన్నప్పుడు (1957-58) కాలేజి మ్యాగజైన్‌లో 'అసమర్థుని ఆత్మకథ' పేరుతో ఒక వచన కవిత రాశారు. అది వారు రాసిన తొలికవితగా వెలుగుచూసింది. ఈ కవిత స్మశానం గురించిన వర్ణనతో ఉత్తమ పురుషలో రాశారు. అది ఒక అభాగ్యుడి సాంసారిక జీవన స్థితిగతులకు అద్దంపడుతుంది.

*"ఈ గేయం నేను వ్రాసే సమయం*
*అర్ధరాత్రి స్మశానంలో నక్కలు*
*గతరాత్రి పూడ్చిన పెద్దబాబు*
*వికారపు ఆకారం తీసిచూసి*
*ఒక్కుమ్మడిగా అరుస్తున్నప్పుడు*
*ఈ చీకటి మార్గంలో ఒంటరిగా వెళ్ళలేక*
*ఏకాకిని నాతో*
*తాను కలిసి వస్తానని*
*జంటగ నాతో పడిలేస్తూ*
*పరిగెడ్తూ వస్తోంటే*
*ఈ అయిదవమైలురాయి*
*దగ్గర్లో ఆగిపోయి*
*నిలబడిచూస్తున్నా... "*

(అసమర్థుని ఆత్మకథ - కాలేజి మ్యాగజైన్ - 1958)

వీర్రాజు వచనకవితా కథలు ప్రేమ, స్నేహం వంటి సున్నితాంశాలు వస్తువులుగా వున్నాయి. 'కొడిగట్టిన సూర్యుడు' కవితా కథాసంపుటిలోని కథలన్నీ వస్తుగతంగా శిల్పగతంగా ప్రత్యేకత గల్గివున్నవిగా పేర్కొనవచ్చు. ఆ తర్వాత ఆయన కలం నుండి 'మళ్ళీవెలుగు' పేరుతో కథారహిత కావ్యం వెలుగు చూసింది. ఈ దీర్ఘకావ్యంలో తన ప్రతిభా పాటవాల్ని అద్భుతంగా ప్రదర్శించారు. ఉషస్సు నుండి అర్ధరాత్రి వరకూ నగర జీవితంలోని ఉత్థాన పతనాలను సామాజిక స్థితిగతులను ఈ కావ్యంలో పలికించారు. ఉషస్సు, ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, సంధ్య, రాత్రి, అర్ధరాత్రి మొదలైన ఒక్కొక్క సమయంలో కావ్యవస్తువులో ప్రధాన భాగాలుగా చోటుచేసుకున్నాయి.

*"ఉదయంపూట నగరంలో*
*ప్రతి మనిషీ ఒక అల కనుక*
*జడత్వాన్ని గొయ్యితీసి పాతుతాడని*
*ఆ సమయంలో ఎటుచూసినా*
*ఎగిరిపడే చైతన్యపు వెల్లువ*

అందుకే
నగరంలో ఉదయం
చైతన్యానికి చిహ్నం"
"మధ్యాహ్నంపూట సూర్యుడు
వెలుగు వేడీవున్నవాడు
పదవీ పలుకుబడి కలవాడు
అక్షరాలా అతను ప్రజల నాయకుడు
ఊడిగంచేసే వాళ్ళమీద గద్దింపులతో
అడుగడుగునా మధ్యాహ్నంపూట
అధికారం తొంగిచూస్తుంది"

"అందాల ముసుగుల్ని వేసుకొని
ఆనందాల వెలుగుల్ని నింపుకొని
ఆకర్షణల ఎదల్ని చుట్టూరా చల్లుకొంటోంది
ప్రలోభాల్లోకి మనసులాక్కొంటోంది
అందుకే
నగరంలో సాయంత్రం
ఆకర్షణలకు చిహ్నం"

"ఆధునిక జీవితం పేరుతో
పాకుడురాళ్ళమీద జారిపోతున్నారు
అలా ఎక్కడికి కొట్టుకుపోతున్నారు
అందుకే
నగరంలో సంధ్య
పతనానికి గుర్తు"

"అర్ధరాత్రి
శిలలా కదలని ఒక స్టిల్ లైఫ్ ఫోటోగ్రాఫ్
అందుకే
అర్ధరాత్రి
జడత్వానికి గుర్తు"

ఇలా నగరాన్ని ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, సంధ్య రాత్రుల్లో నగరాన్ని గురించి వివిధ స్థాయిల్లో 'మళ్ళీవెలుగు' దీర్ఘకావ్యంలో విశ్లేషించారు.

ఆధునిక జీవితాన్ని వర్ణిస్తూ రచించిన మహాకావ్యాల్లో ఇదొకటిగా, వారి బహుముఖ ప్రజ్ఞకు ఈ కావ్యం దర్పణం పట్టిందని సాహితీవేత్తలు పేర్కొన్నారు. వీర్రాజుది ప్రగతిశీల దృక్పథం కల్గిన కవిత్వం. ఆధునికత పేరుతో అర్థంకాని కవిత్వాన్ని వారు తీవ్రంగా నిరసించారు. వీరికి విరసంతో ఎలాంటి సంబంధం లేనప్పటికీ అభ్యుదయకవిగా, విప్లవాత్మక దృక్పధంతో కొన్ని కవితలు రాశారు. శ్రామిక జీవులే సమసమాజాన్ని స్థాపిస్తారన్న ఆశయం వారిది.

"నీకోసం అడవి దారిపట్టిన
ఉగ్రవాది అరికాలిలోకి తొంగిచూడు
ఎర్రటి ఎండలో తనవాళ్ళకోసం
చల్లని మంచు పళ్ళు మోసుకొని
పూరిరోడ్లమీద బాల్యాన్ని పారేసుకుంటున్న
పదేళ్ళ నగ్నపాదాల్ని చూడు
ఒక ప్రక్క విప్లవవీరుడి బాధ్యతల్ని చూడు" అంటూ

బాల్యం బతుకులో బాధ్యతల్ని మోస్తున్న పసివాడి స్థితిని చిత్రించారు ఈ కవితలో.

అంతేకాదు వారి కవిత్వంలో యుద్ధ విముఖత కనిపిస్తుంది. శాస్త్రీయ దృక్పథం ధ్వన్యాత్మకంగా వినిపిస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థను అందులోని లోపాల్ని ఎత్తిచూడంలో వెనకడుగు చూపడు. వీరి కవిత్వంలో మానవతావాదం, విశ్వమానవత చోటుచేసుకుంది నిరుపేదలపక్షం వహిస్తుంది –

"నిజమే అసహ్యంగానే వుంటుంది
కడుపులో ఆకలి
పేగుల్ని మెలేస్తున్నప్పుడు
నోరిప్పితే గాలే దూరిపోతుందన్న భయంతో
అడ్డంగా అన్నంముద్దేదూర్చి
దాని రుచి వాసనల్ని పట్టించుకోకుండానే
అమాంతం మింగేసి పొలమారి
అందరి దృష్టిలో పడి
క్షణం కూడా ఆలస్యం చెయ్యక
ఆబగా, ఆర్తిగా, అన్నం తినే వాళ్ళని
చూడ్డానికి అసహ్యంగానే వుంటుంది"

(అసహ్యమైన అనాగరిక దృశ్యం – ప్రొయిట్రీ వర్క్‌షాప్ నుండి ... 1993)

"నిజం రంగయ్య! నామనస్సు నిజంగానే చివుక్కుమంది
ఐదేళ్ళ తర్వాత ఇప్పుడొచ్చి చూస్తే
పొర్లుతున్న బావినీళ్ళు చూసి పొంగిపోనా
నీ పెళ్ళాం మెళ్ళో కనిపిస్తోన్న పసుపుకొమ్ము చూసి

బాధపడనా

*క్షమించు రంగయ్యా*
*నన్ను క్షమించు*
*ప్రకృతిని అంచనా వేయకపోవడంలో*
*తప్పంతా పూర్తిగానాదే*
*అందుకే నన్ను క్షమించు*
*నీలో ఆశల్ని రేకెత్తించినందుక్కాదు*
*వ్యవస్థని సరిగా అర్థం చేసుకోనందుకు*
*సలహాయిచ్చి*
*నిన్ను అప్పుల ఊబిలోకి తోసేసినందుకు"*

(కన్ఫెషన్ - ఉదయం పత్రిక 6-6-1994)

ఏడాదికేడాది సముద్రం ఊరిని మింగేస్తోంది. ఊరంటే సముద్రానికి కోపం కాబోలు లేక ప్రేమా, ఆకర్షణా? ఆలోచించు ఓమారు చుట్టూ నిశితంగా చూసి ఆలోచించు. కోటాను కోట్ల చెమట బిందువులన్నీ చీలి కాలువలై, వాగులై, వంకలై, యేరులై, నదీనదాలై చివరికి సముద్రంలోనే సదా సంగమిస్తున్నాయి అంటూ శ్రామిక జనపక్షపాతంగా గొంతెత్తే కవిగా -

**"ఈనాడు ఏ మనిషిని దులిపినా**
**బొటబొటా రాలేవి కన్నీళ్ళే కదా!**
**కష్టాలూ బాధలూ యిప్పుడు**
**కోట్లాది జనాల్ని పీడిస్తున్న రుగ్మతలైపోయాక**
**ప్రతి కన్నూ ఓ కొలనే మరి**
**ఏడాది పొడవునా రాల్చే కన్నీటి చుక్కలు**
**వేల కోట్లలో వుండడం ఆశ్చర్యమేంకాదు**
**కన్నీళ్ళమూట సరే**
**వారి చెమట చుక్కల సంగతేమిటి"**

(ఒక అసంబద్ధ నిజం - కవితాసంపుటి - 2014)

1994లో గుంటూరులో ఏర్పాటు చేసిన ఓ సాహిత్యసభలో ప్రసంగిస్తూ -

"స్పందించినప్పుడే నేను రాస్తాను. నిజాయితీకి పెద్దపీటవేస్తాను. ఎప్పుడూ, ఎక్కడా నన్నునేను దాచుకోడానికి ప్రయత్నించను. ఏ రచనకైనా సాహిత్య ప్రయోజనమో, సామాజిక ప్రయోజనమో విధిగా ఉండి తీరాలని నేను భావిస్తాను. ఇది నా రచన దృక్పథం. ఇదే నా సాహిత్యనేపథ్యం" అంటూ వర్తమాన వ్యవస్థలో రచయితకు ఉండాల్సిన బాధ్యతల్ని ఈ విధంగా గుర్తు చేశారు వారు. రచయితకు వాస్తవిక దృష్టి ఉండాలన్న విషయాన్ని నొక్కిచెప్పారు.

వయసురీత్యా డెబ్భై అయిదు వసంతాలు పూర్తిచేసుకున్న పూర్ణ పురుషుడు, నిత్యసత్యాన్వేషి, అవిశ్రాంత సాహితీవేత్త శీలావీర్రాజు. ఇటీవల విడుదలైన వారి కవితా సంపుటిలో తన్నుతాను ఆవిష్కరించుకుంటూ మనతో ఆత్మీయ కవితా సంభాషణ చేశారు. తన చిరునామాను తెలియజేశారు.

*"పచ్చని ఆకులు పండిరాలిపోయినా*
*ఎంతమాత్రం చెట్టు దిగులు చెందనట్టే*
*వయసు వార్ధక్యంలోకి తోసేసినా*
*మనస్సింకా నిబ్బరంగా వుంది*
*నా రంగుల ప్రపంచం*
*నన్ను కాపాడుతూనే వుంటుంది*
*నా అక్షర ప్రాంగణం*
*నన్ను ఆదుకొంటూనే వుంటుంది*
*నా జీవన చరమాంకం చివరి క్షణం వరకూ*
*నా రంగుల ప్రపంచమే నా విహారస్థలి*
*నా అక్షర ప్రాంగణమే నా చిర్నామా"*

అంటూ అటు సాహిత్యంలోను ఇటు జీవితంలో పండిపోయిన తన హృదయగతాన్ని మనతో పంచుకున్నారు.

వారి కవిత్వం కొడిగట్టిన సూర్యుడు, హృదయం దొరికింది, మళ్ళీవెలుగు, కిటికీకన్ను, ఎర్రడబ్బారైలు, పడుగుపేకల మధ్య జీవితం ఈ ఆరు కవితా సంపుటాలను కలిపి 'శీలావీర్రాజు కవిత్వం' పేరుతో బృహద్గ్రంథాన్ని వెలువరించారు. అలాగే ఎంపిక చేసిన కథలతో శీలావీర్రాజు కథలు పేరుతో మరొక గ్రంథాన్ని వెలువరించారు.

ఇలా సాహిత్య ప్రయోజనంకోసం, సామాజిక ప్రయోజనంకోసం నిత్యసత్యాన్వేషిగా, తాత్వికుడిగా శీలావీర్రాజు జీవితం వర్తమాన తరానికి స్ఫూర్తి దాహర్తంగా నిలుస్తుంది.

ఉత్తమ సాహిత్యసృష్టికర్తగా, అభ్యుదయవాదిగా, చిత్రకారుడిగా ఆధునిక తెలుగుసాహిత్య చరిత్రలో వీర్రాజుగారి స్థానం పదిలంగా ఉంది.

❋

# నిశ్శబ్ద స్వరం

- బిరుసు సురేష్‌బాబు
966861565




కులాధిపతులే కులపతులైనచోట
అహంకారం ఆకాశమై
వాడ మనుషులకు 'వెలే' మిగిలింది
మానవ హక్కుల్ని కాలరాసే నేరగాళ్ళే మంత్రులైన చోట
రక్తంతో తడిచిన చేతులే రాజ్యమేలుతున్నచోట
ఉరిశిక్ష నేరమన్న పాపానికి
ఉరే మిగిలింది
కసాయి కాషాయానికి
అధికార ఖడ్గం చేజిక్కినచోట
విద్యానవనాలు నేలమట్టమై
రోహిత' పుష్పాలకు చితే మిగిలింది
ఎన్ని కన్నకలాటల మధ్య
చివరి శ్వాస విడిచావో
గాయపడిన నీ గుండెకు తప్ప
మరెవరికి తెలుస్తుంది
నువ్వు వెళ్ళేముందు..
ఈ మత పిశాచాలు ముఖానికి పులుముకున్న
రాజకీయ రంగుపై
నువ్వు కాండ్రించి ఉమ్మేసిన ఉమ్మిని
వాళ్ళింకా గమనించలేదా..!?
నువ్వు వెళ్ళేముందు...
కుల వ్యవస్థ ఇన్నాళ్ళు పోగు చేసుకున్న
గడ్డివాములపై
నువ్వు విసిరిన వెలివాడ కాగడాను
వాళ్ళింకా పసిగట్టలేదా...?
విగ్రహపూజ జరిగే అగ్రహార నడిబొడ్డుపై
ధిక్కార నాట్లేసిన దళిత సాహసి అతడు
గుప్పిట నిప్పవుతాడేగానీ
గుహలో నిశ్శబ్దం కాబోడు
హైందవ బంధనాల్ని తెంచుకొని
'హిందూ' మహాసముద్రాన్ని అవలీలగా దాటిన
దళిత కెరటం అతడు
నిరసనై నింగికెగురుతాడే గానీ
నిష్క్రమనై నేలకొరగలేడు
రెపరెపలాడే అస్తిత్వ పతాక అతడు
నిశ్శబ్దంతో శబ్దాల్ని పుట్టించగలడు
ఆగిన గొంతుతో
వేల గళాల్ని సృష్టించగలడు
మతోన్మాద కొండల గుండెల్లో
సుతారంగా గ్రుంకిన ఎర్రటి గాయం అతడు
రేపటి కోసం
వెలుగు రవ్వల్ని వెంటపెట్టుకొని
ఉదయించక మానదు.

(వేముల రోహిత్ స్మృతిలో....)

# బొగ్గులబట్టి

- భారతి



మావూర్లో కమలా నేనూ మంచి జతగత్తెలమి. ఆట్లాడుకున్నా, పోట్లాడుకున్నా, అరుట్లు కొట్టినా ఆవుల్ని మేపేకి పోయినా ఏ పని చేసినా ఇద్దరమూ కలిసే. అట్లాంటిది రెన్నాళ్లనింటి అది కనిపిస్తా లేదు. 'ఏడకి పోయింది ఇది' అని అనుకొంటా, మాయవ్వ నన్ను ముగ్గుపిండి తెమ్మంటే, ముగ్గుపిండి గుంతలకాడికి పోతా ఉండాను. "ఓమ్మే ఉండుండు, నేను గుడకా వస్తాండా" అని వెనకనింటి కమల గొంతు వినిపించింది. వెనక్కి తిరిగి చూస్తే పరిగెత్తి వస్తా ఉండాది ఆయమ్మి.

"అవును మే కమలా, నిన్నామొన్నా ఇంటికాడ లేవే, ఏడకి పోయింటివి" అని దగ్గిరికి వచ్చిన కమలను అడిగితిని

ఆయమ్మి పొడుగ్గా గాలిని విడుస్తా "నీకేమి తెలుసులేమ్మే మా అటసాట్లు. నేనూ మాయమ్మా సదరంగా కూడు తిని వారం అయింది. మాయమ్మకు ఒళ్లు బాగలేక పనికి పోలేకపోయె. మా నాయన కత నీకు తెలుసుకదా. నన్నూ మాయమ్మనూ కంటితో చూడడు. సంపాదించిన నాలుగు కాసులు వాని ముండకమొక్కాన్నే పెట్టేసి వస్తుంటాడు" అనింది.

అవును కమల వాళ్ల నాయనకు ఒక చిన్నిల్లు ఉండాదని ఊర్లో అందరికీ తెలుసు. ఆయమ్మకే అన్ని డబ్బులూ ఇచ్చేస్తుంటాడంట. కమలవాళ్లమ్మే కూలినాలి చేసి ఆ కాపరాన్ని లాగేది.

"మీ ఇంట్లో ఎప్పుడూ ఉండేదే కదా, ఇప్పుడు ఏమయింది మే" అంటిని.

"మాయమ్మకు ఒళ్లు బాగలేదు కదా, ఇంట్లో చేరడు గింజలు కూడా లేక అల్లాడిపోతిమి. ఎత్తి ఎసిట్లోకి వెయిను పిడికిడు నూకలు దొరకలేదు. మా నాయిన బొగ్గులు కాల్చను అడివికి పోతా ఉంటే, ఆయనతోపాటే నాలుగు రూపాయలన్నా చేతికొస్తాయని నేనూ బయలుదేరితి. అప్పటికీ మా మల్లవ్వ మా నాయినతో "ఏలరా ఆడబిడ్డను అడివిలోకి తోడుకొని పోయేది" అనింది. 'ఆడబిడ్డ అని ఇంట్లో కుచ్చోబెట్టి సాకేకి అయితుందా' అనేసినాడు మానాయిన. ఆయనతో కలిసి పెద్ద పుల్లవుగుట్టకు పోతిని. ఇద్దరమూ మావిటాల వరకు పెద్ద పెద్ద కట్టెలు కొట్టి ఉడ్డేస్తిమి. అనెంక కొంచెంసేపు అలత తీర్చుకుని రెయ్యి ఏడుగంటలప్పుడు బట్టికి కట్టెల్ని పేర్చేకి మొదులు పెడితిమి. మా బట్టికి అరమైలు దూరంలోనే చిన్నతాతా చిన్నవ్వ వాళ్లు బట్టి పెట్టి కాలస్తా ఉండారు. మేము బట్టిని పేర్చి కట్టెలకి నిప్పు పెడితిమి. కట్టెలు అంటుకుని, అగ్గి చిట్లాకుప్ప మలిగినట్లు మలగతా ఉండాది.

## వకుళాభరణం లలిత కన్నుమూత



ప్రముఖ రచయిత్రి, పరిశోధకురాలు వకుళాభరణం లలిత మార్చి 14న కన్నుమూశారు. ప్రసిద్ధ చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ సతీమణి అయిన వీరు 1937లో ప్రకాశం జిల్లా వెంకంపేట గ్రామంలో జన్మించారు. నేరస్థ జాతులను, దేవదాసి, జోగిని, బసివి, మాతంగి వంటి దురాచారాలకు బలైపోయిన మహిళల జీవితాలను పరిశోధించి సభ్యసమాజం దృష్టికి తీసుకొచ్చే ప్రయత్నం చేసారు. క్షణం క్షణం నలిగిపోతున్న వర్గాలను తన పరిశోధనలకు లక్ష్యంగా చేసుకోవడంలో వకుళాభరణం లలిత ప్రత్యేకత కనపడుతుంది. వకుళాభరణం లలిత ఈ పరిశోధనలకి సంబంధించి 16 పరిశోధనా గ్రంథాలు, వందకు పైగా వ్యాసాలు రాశారు. అరవైమందికి పైగా విద్యార్థులకు పరిశోధన పత్రాలు రాయడానికి మార్గ నిర్దేశం చేశారు. నేరస్థ జాతులుగా ముద్రపడిన వారి సముద్ధరణ కోసం కృషిచేసిన లవణం, హేమలతాలవణం దంపతుల సహకారంతో దేశంలోని అనేక ప్రాంతాలలో ఉన్న సంచార జాతులను కలిసి వారి జీవన స్థితిగతులపై చేసిన ఈ పరిశోధనలు ప్రశంసలందుకొన్నాయి. 'నా జ్ఞాపకాలు' పేరుతో తన జీవిత కథను రాశారు.

సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి హైదరాబాద్‌లో వీరి భౌతిక కాయాన్ని సందర్శించి నివాళి అర్పించారు. ❋

ఆయాల కాడ మా నాయిన ఏమి చేసినాడు అనుకుంటివి. 'మేయ్ నేను పక్కబట్టివాళ్లతో మాట్లాడి ఇప్పుడే వస్తాను. నువ్వు బట్టికాడనే కూర్చోనుండు' అనేసి అదే పోతా. రెయ్యి పన్నెండు ఆయె, ఒంటిగంట ఆయె, రెండు గంటలాయె... అయినా రాలేదు. నేను కాలతుండే బట్టి పక్కనే కూచ్చుని ఉంటి. ఒక రెయ్యిలో బట్టిలోని అగ్గి ఆరిపోయింది. పచ్చని కొమ్మల్ని పెరక్కొచ్చి ఎర్రటి నిప్పుల్ని తట్టి తట్టి ఆరిపితిని, నిప్పులు ఆరి బొగ్గులైనాయి. చుట్టూ చిత్తచీకటి, కడుపులో ఆకలి. అడివిలో దొరికిన కాయా కసురూ పెరక్క తినిందే గానీ కూడా కవళమా, గంగమ్మని, ఎల్లమ్మని, అయమ్మని ఈయమ్మని తలుసుకుంటా, చుక్కల వెలుతులోనే పంగలకట్టితో బట్టిని యిరగదోసి ఆరిన బొగ్గుల్నంతా ఉద్దతోస్తిని. అప్పుడు, ఇంక రవంచ సేపుకి తెల్లవారతాది అనంగా వచ్చినాడు మా నాయిన" అని అది చెబుతా ఉండాది.

దాని మాటలకి అడ్డంపోతా "అయితే అంచేపు ఏడకి పోయినాడంట మే మీ నాయిన" అని అడిగితిని.

"ఆమాటే మా నాయిన్ని అడిగితి. ఏడకీ పోలేదు. చిన్నతాతోళ్ల బట్టికాడ ఉంటిని అని చెప్పినాడు. నేను నిజిమేలే అనుకుంటి. అనెంక కదా తెలిసింది, అదీ చిన్నవ్వ చెప్పింది. రెయ్యి అంత పొద్దులోనే ఊర్లోకి పోయి, సారాయి తాగి వాని చిన్నపెండ్లాము ఇంట్లో పణుకోని లేసి వచ్చినాడంట. నేనేమో ఆ రెయ్యి మబ్బులోనే బొగ్గుల్ని ఆర్పి ఉద్దదోసి కాళ్లూచేతుల్ని కాల్చుకుంటి" అంటా కాలిబొబ్బలెక్కిన చేతుల్ని చూపించింది ఆయమ్మి. నాకు అయ్యో అనిపించింది.

"అనెంక ఊర్లోకి ఎప్పుడొస్తిమి మే" అంటిని.

"మా నాయన మా బట్టికాడికి వచ్చిన కొంచేపుకి చిన్నతాత వచ్చి, 'రేయ్ యెంగిటిగా మనం కట్లు కాలస్తుండేది పారస్టోళ్లకి తెలిసిపోయిందంట. గబగబ బొగ్గుల్ని జవురుకోని బయిదేలండ్రా' అనేసి పోయినాడు. మేమిద్దరమూ బొగ్గుల్ని, చెరొక గోనిసంచికి నింపుకుంటిమి. బొగ్గుల మూట చిన్న బరువు కాదు, ఎట్లనో మోసుకుని పోలీసోళ్ల కంట పడకుండా అడివిని దాటితిమి. పేటకు ఎత్తుకుని పోయి, అంగట్లో అమ్మి, ఒక మూట డబ్బుల్ని మొత్తంగా మా నాయినే ఎత్తుకుని, రెండో మూట డబ్బుల్లో సగం నాకిచ్చినాడు. ఆ అర్ధము డబ్బులతో అంగట్లో నూకలు, పిండి, ఉప్పు, మిరపకాయలు, మాయమ్మకు వక్కాకు కొనుక్కుని ఇంటికి పోతి. అన్నీ మాయమ్మ చేతికిస్తే, మాయమ్మ నన్ను దబ్బుకుని ఏడిచింది. అప్పటికి మాయమ్మా నేనూ మెతుకు ముట్టి మూడుదినాలు. ఆదరాబాదరా సంగటి కెలికి, ఉప్పూ చింతపండూ వట్టి మిరపకాయలూ కలిపి ఊరుబిండి నూరుకుని, ఆ ఊరుబిండ్లో అద్దుకుని చెరొక ముద్ద తిని పణుకొంటిమి" అని చెప్పింది ఆయమ్మి.

"మన కొంపల్లో మగోళ్ల కతంతా ఇట్లే ఇంది లేమ్మే పద" అంటిని నేను. మా మాటల్లోనే ముగ్గుపిండి గుంతలు వచ్చినాయి. చెరొక సంచిడు ముగ్గుపిండిని తవ్వుకుని ఇండ్లకు తిరుక్కుంటిమి.

❋

## నానీలు

- కోపూరి పుష్పాదేవి
9440766375

మహిళలు
మణిపూసలు
మనసుపెడ్తే
మహత్తర కార్య నిర్మాతలు !

ఆమె అనాకారి
ఐనా అందంగా ఉంది
ఆత్మవిశ్వాసం
చేసిన అలంకారం !

కమ్మని జైలు
ఉంటుందా?
ఎందుకులేదు
ఆడపిల్లకు అత్తవారిల్లు !

తల్లి
ఎన్నో చేస్తుంది బిడ్డకోసం
బిడ్డ కూడా అన్నీ చేస్తుంది
తన బిడ్డకి !

ఆమెకు
అందం, ఆస్తీ అన్నీ ఉన్నాయి
ఒక్కటి తప్ప....
అదే చిరునవ్వు !

ఆధునిక స్త్రీ
అన్ని రంగాల్లో హుషారు
పనిమనిషి రాలేదా?
బేజారు !

నీ పని
సులువుగా కావాలా?
మామ్మగారిని
అక్కా అని పిలు. అంతే చాలు !

ఆమె ఎన్నో రాస్తుంది
కథలు, నవలలు
అంతకోపం ఎందుకో
జనం మీద....?

మనిషి అందమైనదే
మాట మధురమే
మరి.....
మనసు సంగతో.....?

నగలు, లిప్స్టిక్కుల
భక్తిరసం?
వెల్లి విరుస్తోంది గొప్పగా
ఆధ్యాత్మికం.....!

ఆమె వయసు
అతి తక్కువంట.
ముని మనవడి పెళ్ళి
అవలేదింకా...!

అందగత్తెలు
పోటీల్లో పాల్గొనకపోతే?
కురూపే
విశ్వసుందరి...!

❋

## నేనెక్కడ?

- కె. ఉషారాణి
9492879210



విశ్వాంతరాళంలో నేను
అయినా నేనెక్కడ?
నదీనదాలన్నీ నావే
అయినా నేనెక్కడ?
అవనీ ఆకాశం నావే
అయినా నేనెక్కడ?
కాంతి నేనే శాంతి నేనే
అయినా నేనెక్కడ?
గగనంలోని మెరుపు విరుపుల నుండి
పృథ్విని తాకి ఎగిసిపడబోతున్న
నిశీధిలోని ఉల్కాపాతాన్నై
భూనభోంతరాళకు వెలుగులు విరజిమ్ముతూ
హిమగిరుల నుండి ఎగసిపడి
సంద్రాన్ని చేరే లోపే సిరులు పండించబోతున్నా
విశ్వమంతా నాదే
విజయాలన్నీ నావే..
అంతటా నేనే

❋

# వాస్తవ జీవిత ప్రతిబింబాలు నిర్మలారాణి కథలు

- ఆచార్య కొలకలూరి మధుజ్యోతి
9441923172



*ఈ ప్రాంత సాహిత్య సృజనలో స్త్రీ ప్రాతినిధ్యం ఎంత ఉందో గుర్తించవలసిన అవసరం కూడా ఉంది. సంఖ్యకు అతి తక్కువగా లేరు. కాని గుర్తింపు విషయం పరిశీలించవలసిందే. డా.కె. శ్రీదేవి, తంగిరాల మీరా సుబ్రహ్మణ్యం, చక్కిలం విజయలక్ష్మి, కోమలాదేవి, ఆర్. వసుంధరా దేవి, డాఎం.కే. దేవకి, ఇలా ప్రముఖులు ఉన్నారు. కాని లెక్క నిగ్గు తేల్చవలసి ఉందని ఈ సందర్భం గుర్తు చేస్తూ ఉంది.*

కేంద్ర సాహిత్య అకాడమీ, బెంగుళురు 'రాయలసీమ రచయిత్రుల కథలు - స్త్రీ జీవిత చిత్రణ' అనే అంశంపై నారీచేతన సాహిత్యసభ నిర్వహించ తలపెట్టింది. ఇది ఆలోచించదగ్గ అభినందించదగ్గ ప్రయత్నం. కరవు కాటాకాలకు నిలయమైన రాయలసీమ, అదే కారణం వల్ల అన్ని విషయాలలోనూ వెనుకబడింది. అటువంటి ప్రాంత సాహిత్యం పట్ల చూపు సారించటం అనివార్యంగా నేడు అవసరం. అంతేకాదు ఈ ప్రాంత సాహిత్య సృజనలో స్త్రీ ప్రాతినిధ్యం ఎంత ఉందో గుర్తించవలసిన అవసరం కూడా ఉంది. సంఖ్యకు అతి తక్కువగా లేరు. కాని గుర్తింపు విషయం పరిశీలించవలసిందే. డా.కె. శ్రీదేవి, తంగిరాల మీరా సుబ్రహ్మణ్యం, చక్కిలం విజయలక్ష్మి, కోమలాదేవి, ఆర్. వసుంధరా దేవి, డాఎం.కే. దేవకి, ఇలా ప్రముఖులు ఉన్నారు. కాని లెక్క నిగ్గు తేల్చవలసి ఉందని ఈ సందర్భం గుర్తు చేస్తూ ఉంది.

స్త్రీలు అందరూ రచనలు చేసినంతనే స్త్రీవాదులు కారు. వారు రాసిన సాహిత్యం అంతా తప్పనిసరిగా స్త్రీవాద సాహిత్యం అయి ఉండాలనే లేదు. స్త్రీల సున్నిత హృదయం తన చుట్టూ జరుగుతున్న విషయాల పట్ల స్పందించి వెలువర్చిన సాహిత్యం ఎంతో! అందులో కొంత స్త్రీవాదం చెప్పే ఆలోచనలూ ఉండవచ్చు. తనూ, తన చుట్టూ జరిగే పరిణామాల పట్ల స్పృహ ఉన్న కథకుల రచనల్లో చైతన్యం ఉంటుంది. ప్రత్యక్షంగానో పరోక్షంగానో సున్నితంగానో ఘాటుగానో, సూటిగానో చాటుగానో చైతన్యం కనిపిస్తుంది. చైతన్యం ఉంటేనే స్పందన, స్పందన ఉంటేనే కథ ఆవిష్కృతం కావటం సాధ్యం. ఇది స్త్రీ కథలలో సాక్షాత్కరిస్తుంది.

అనంతపురంలో ఉపాధ్యాయురాలిగా జూనియర్ కాలేజీ అధ్యాపకురాలిగా చేసి పదవీ విరమణ చేసిన జి. నిర్మలారాణి రాసిన కథా సంకలనం 'గాజుకళ్ళు'. మహిళల పట్ల సానుకూల దృష్టి, రచయిత్రి సామాజిక కార్యకర్త కూడా. మానవ సంబంధాలను నియంత్రించే ఆర్థిక అంశం పట్ల స్పష్టత. పతనమయిన విలువల నేపథ్యంలో మానవుడి దిగజారుడుతనం, ప్రాంతీయమైన కరువు సమస్య మనుష్యులతో ఆడుకోవటం చిత్రించాయి ఈ కథలు. సమస్యను చూడటం చూపటంతో రచయిత్రి విజయవంతం అయ్యింది.

'గాజుకళ్ళు' సంపుటిలో పదకొండు కథలు ఉన్నాయి. మానవీయ విలువలను చాటే కథలున్నాయి. స్త్రీలలో ఉన్న చైతన్యాన్ని, ఉండాల్సిన చైతన్యాన్ని చూపిన, హెచ్చరించిన కథలు అధికం. భిన్నాంశ ప్రాధాన్యంతో సాగాయి కథలు.

'మానవత్వం' కథలో, అతి పేదవాడు డబ్బుకు ఆశపడక మరో పేదకు సహాయం చేస్తే, లేడి డాక్టరు డబ్బుకు కక్కుర్తి పడటం వల్ల వైద్యం అందక ఆ పేదవాడి భార్య మరణించింది. 'దిగ్రేట్స్' కథలో మంచం పట్టిన తండ్రి మరణాన్ని కోరుకున్న కొడుకు మానసిక స్థితి పశ్చాత్తాపం వివరింపబడ్డాయి.

'అధిగమనం' కథలో తన ఇంటి భద్రతకై, కాన్పుకు వెళ్ళబోయే ఓ ఇల్లాలు, ముందు చూపుతో చేసిన దుర్మార్గపు ఆలోచన ఓ పసివాడిని దొంగగా ముద్రించి దొంగగా మార్చింది. ఈ మూడు కథల్లో మానవత్వాన్ని మరచిన పాత్రలు కనిపిస్తాయి. లాలసత, స్వార్థపరత్వం మనిషిని ఎంత పతనం చేస్తాయో చూపాయి ఈ కథలు.

**స్త్రీ వాదం ముందుకు తెచ్చిన ఎన్నో ఆలోచనలు ఈ కథల్లో కనిపిస్తాయి. వివక్ష, శారీరక హింస, ఇంటిపని, లైంగిక దోపిడీ, స్వయం నిర్ణయాధికారం సహజీవనం మొదలయినటువంటివి.**

ఈ కథల్లో ప్రాంతీయ స్వభావాన్ని అద్దుకొన్న కథ 'గాజుకళ్ళు'. కరవు ఆకలి ఎంతటి మనిషినైనా కుంగదీస్తాయి. బాగా బతికిన కుటుంబాలు చతికిలబడిపోతాయి. ఒంట్లో శక్తి ఉన్నవారు, చేసేందుకు పనిలేక, అక్కడ ఉండలేక వలసపోతారు. ఊళ్ళో ఉండిపోయిన వారికి జీవనం? జీవనాధారం? సమయానికి వలసవెళ్ళిన వారికి పనులు దొరికితే వీరికి డబ్బు పంపగలరు. లేకపోతే...? అలాంటి స్థితిలో ఆడపిల్లలే వారి జీవనాధారం. ఆడపిల్లలు శరీరాలే పెట్టుబడి, రాబడి మార్గాలు. ఇది కరవు ప్రాంతంలో సాధారణమైన విపరీతం. ఈ వాస్తవమే 'గాజుకళ్ళు'గా రూపుదిద్దుకొంది. తండ్రి చనిపోయాడు. అన్న ఎటో వెళ్ళిపోయాడు. మిగిలిన తల్లిని లక్ష్మి పోషించేది. ఇంకా అసాధారణం దయనీయమైన విషయం. వేశ్యావృత్తిలోని హింసను తాళలేక లక్ష్మి కుళాయప్పతో వెళ్ళిపోతే, వారందరిని బొంబాయి నుంచి మద్రాసుకు తీసుకెళ్తూ ఆ ఊరిలో ఆగిన బంగారక్కతో, తన కూతురిక రాదని బదులు తానొస్తానని అంది. ఆమె డబ్బు ఇచ్చి కూతురిని కొనుక్కొంది. ఐదువేల రూపాయలను ఆ తల్లికాని, అప్పుడే ఊరికి తిరిగొచ్చిన అన్న కాని ఇవ్వలేని స్థితి. దారుణమైన వాస్తవాన్ని, గుండెను పిండి చేసే దుఃఖాన్ని మూటగట్టి పాఠకుల ముందు నిలిపింది రచయిత్రి.

స్త్రీ వాదం ముందుకు తెచ్చిన ఎన్నో ఆలోచనలు ఈ కథల్లో కనిపిస్తాయి. వివక్ష, శారీరక హింస, ఇంటిపని, లైంగిక దోపిడీ, స్వయం నిర్ణయాధికారం సహజీవనం మొదలయినటువంటివి. ఒకే ఇతివృత్తంలో ఒక భాగంగా రెండు మూడు అంశాలు కూడా ఉన్నాయి. ఏ ఒక్క అంశాన్నో ప్రధానం చేసి రాసిన కథలు కొన్నే. రెండూ లేక అంత కంటే ఎక్కువ అంశాలు / ఆలోచనలు కథల్లో అల్లటం ఈ కథల్లో కనిపించే ఓ విలక్షణత.

స్త్రీ పురుష వివక్ష ఈ పితృస్వామ్య వ్యవస్థలో ఉంది. అది చిన్నతనం నుంచి ఆడ మగ పిల్లల పెంపకంలో ఉండటం పరిపాటి. ఇందులో మొదలయ్యే వివక్ష సమాజానికి చేటు చేసేదిగా మారినా, సమాజ వైఖరిలో మార్పు రాకుండా ఉంది. 'స్త్రీలను అదుపులో ఉంచితే మొత్తం సామాజిక జీవిత విధానాన్నే అదుపు చెయ్యవచ్చునని నమ్ముతుందీ పితృస్వామ్యం. అందువల్ల కొత్త కొత్త పద్ధతుల్లో నిరంతరం ఆ అదుపు కోసం ప్రయత్నిస్తుంటుంది' అంటారు ఓల్గా. నిజాలు రాస్తే నీలికవితలంటారా? (స్త్రీ వాద వివాదాలు, పు.33) అనే వ్యాసంలో స్త్రీలపై ఇంత జాగ్రత్తగా పెట్టే అదుపు మగవారిపై ఉండదు. ఇటువంటి వివక్షను రచయిత్రి ఎత్తి చూపింది. 'ఎంతెంత దూరం' కథలో ఎంసెట్ కోచింగ్‌కి వెళ్ళి ఆలస్యంగా వచ్చిందన్న కోపంతో కూతురిని, తిట్టే తల్లి వేళాపాళాలేని కొడుకు రవి రాకను ప్రశ్నించదు. మగవాళ్ళ వేధింపులు భరించలేక రాధిక అనే తోటి ఆడపిల్ల చదువుకే ఆటంకం అయ్యింది. ఆ మధ్య అమ్మాయిపై అఘాయిత్యం చేసిన వారంటూ, నలుగురిని కట్‌డ్రాయర్‌తో ఊరేగిస్తూ పోలీసులు లాఠీలతో వాయిస్తూ ఉన్న వాళ్ళలో అచ్చోసిన ఆంబోతులా సమాజంపైకి వదిలేసిన రవి ఉండటం అతని చెల్లి చూసింది. మగవాడిగా పుట్టడం అర్హతగా బలాదూర్‌గా తిరిగేవాడిని క్రమపద్ధతిలో పెట్టాలనే కనీస ఆలోచన లేని తల్లిదండ్రులు ఎందరో! దాని పర్యవసానం అతడి జీవితం నాశనం కావటమే. మగపిల్లాడు అంటూ కొమ్ములు తగిలించే తల్లిదండ్రులు, వాడి మంచి చెడ్డలూ గమనించాలి. లేకపోతే సమస్య ఇంటిని దాటి ఊరును చేరుతుంది.

'వికసించిన అంతరంగం' కథలో ఇద్దరూ ఉద్యోగస్థులే అయిన దంపతులు ఇంటిపనిలో పరస్పరం సహకరించుకొనేవారు. చుట్టపు చూపుగా వచ్చిన అత్తా ఆడపడుచులు, మగవాడు అది చేయరాదని, అన్నయ్యకు ఆ పనులు అలవాటు లేవని చెప్తూ అతడిని ఆపటం భార్యైన జ్యోతి అసహనానికి కారణం అయ్యింది. అలిగి తమ్ముడు ఇంటికి వచ్చిన జ్యోతి, ఇన్స్‌పెక్షన్ అని మరదలు త్వరగా వెళితే, పనులు చేసుకొంటున్న తమ్ముడిని చూసి మరదలిపై నిష్ఠూరాలాడింది. కథలో జ్యోతి అనుభవించిన రెండు అనుభవాలు వివక్ష స్వరూపాన్ని తెల్పేవే. తన విషయంలో మగవాడు అనే అహం అడ్డురాకుండా భర్త పనులు అందుకోవాలనుకొనే ఆధునిక భావాల జ్యోతిలో తమ్ముడి విషయంలో సంప్రదాయ భావాల జాడ తెలుస్తుంది. వివక్ష భావన అంతర్లీనంగా రక్తంలో జీర్ణించుకుపోయిన వ్యవస్థలో భాగంగా ఉంటూ, ఆధునిక భావాలు అలవర్చుకొంటూ, రెండింటి ఒరిపిడిలో నలిగే స్థితిని జ్యోతిలో చూడవచ్చు.

వివక్ష తీవ్రత సమాజానికి ప్రమాదకారిగా మొదటికథ చెబితే, వివక్ష ఎంత లోతుల నుంచి పెళ్ళగించాలో రెండో కథ చెబుతుంది.

స్త్రీ పట్ల పురుషుడి దౌష్ట్యానికి నిదర్శనం శారీరకహింస. హింసపెట్టడం హక్కు అని పురుషుడు భావిస్తే కొన్నిసార్లు భార్య కూడా అతడి హక్కుగా పరిగణించటం ఆశ్చర్యం కలిగించే అధ్యయన నివేదిక. ఇది నిరక్షరాస్యులలో అధికం. హింసకు గురయ్యే వారిలో మధ్య తరగతివారూ అధికమే. 'బొమ్మల పెళ్ళి' కథలో ఒక పాత్ర రాధ. భర్త మరణించడంతో అతని ఆఫీసులో ఉద్యోగం ఇచ్చారు. మళ్ళీ పెళ్ళి చేసుకొమ్మని అంటే చేసుకోనంది. పెళ్ళి రక్షణ కాదంది. తన వీపు నిండా కాల్చిన వాతలు చూపింది. అతని తాగుడు అనుమానం వివాహ జీవితాన్ని నరకం చేయటాన్ని చెప్పింది. ఇది వివాహ వ్యవస్థలో స్త్రీ పడే వేదనకు నిదర్శనం. అతడిని అల్పాయుష్కుడిని చేశాయి. అతడే బతికి ఉంటే ఆమె పట్ల ఇంకెంతకాలం ఈ హింసాపర్వం సాగేదో ! 'కొత్తస్పర్శ' కథలోనూ ఇదే దుర్భరత. విజయలక్ష్మి అనే డ్రిల్లు టీచర్, కట్నం చాలలేదని చావబాదే భర్త నుంచి విముక్తిని చావులో వెతుక్కుంది. అదే దురవస్థలో ఉన్న ఇందిర భర్త క్యాంపు పేరుతో సావిత్రి అనే తోటి ఉద్యోగస్థురాలితో లాడ్జిలో గడుపుతున్నాడని మరిది ద్వారా తెలుసుకొంది. భరించలేక పోయింది. ఇంత దుర్వర్తనం ఉన్న భర్త ప్రకాస్, పచ్చ కామెర్ల రోగిలా ఇందిరను నిందించాడు. భర్త కోసం ఎదురు చూస్తూ వర్షంలో చీకట్లో నిలబడ్డ ఇందిరను ప్రకాష్ కొలీగ్ చూసి ఇంటి దగ్గర దింపి వెళ్తే, దానిని సాకుగా తీసుకొని ఆమెతో అతనికి తమ్ముడికీ ఏంటి సంబంధం అంటూ కొట్టి బయటకు వెళ్ళిపోయాడు. విజయలక్ష్మి హింసను భరించలేక చనిపోతే, ఇందిర భర్తను విడిచిపెట్టాలని నిర్ణయించుకొని హింస నుంచి బయట పడింది.

'మామూలు కత కాదు' కథలో కట్నం కోసం భార్యను హింసించటం ఉంది. కట్నం పొందటం తన హక్కు. అది ఇంకా ఇంకా భార్య తరఫువాళ్ళు ఇవ్వాలి. ఇవ్వకపోతే శారీరక హింస. కాకపోతే హింసకు పరాకాష్ఠ ఆమె ఉసురు తియ్యటం. అలాగే ఈ కథలో రాధను కిరసనాయిల్ పోసి కాల్చి చంపాడు సతీష్.

*ఇంటిపని పిల్లల పని వంటి తప్పనిసరి బాధ్యతలు. తప్పించుకోగల ఉద్యోగ బరువును దించుకోవచ్చుగా అని వాటి మధ్య నలిగిన వసుంధర అనుకొంది. మానస ఆర్థిక స్వేచ్ఛ కోసం ఉద్యోగం చేస్తాను అంది. మూడు తరాల ఆలోచనలను శాసించిన ఇంటిపని వైవిధ్య ప్రదర్శన ఈ కథ.*

ఈ మూడు కథలు హింస తీవ్రతను చూపేవే. 'బొమ్మల పెళ్ళి, మామూలు కత కాదు' కథలు హింస పరాకాష్ఠగా ఆత్మహత్య, హత్యలను చూపితే, 'కొత్త స్పర్శ' హింస నుంచి బయట పడమనే సూచనను ఇందిర చర్య ద్వారా ఇచ్చింది.

స్త్రీలు అందునా ఉద్యోగస్థులైన స్త్రీలు ఇంటిపని భారంతో సతమతమవు తుంటారు. స్త్రీకి అనూచానంగా వచ్చే ఇంటిపని పూర్వం అయితే రోజంతా ఉండేది. ఇప్పుడు అదంతా చేసుకొని పరుగులు పెట్టటం, అక్కడ పోటీకి తట్టుకోవటం, రెండు గురుతర బాధ్యతలతో స్త్రీ ఒత్తిడికి గురవుతూ ఉంది. 'వికసించిన అంతరంగం'లో అత్తా ఆడపడుచులు వచ్చినప్పుడు తనకు ఇంటి పనిలో సహకరించకపోవటం, జ్యోతి నలిగిపోవటం చిత్రితమయ్యింది. 'మూడో అవతారం' కథ మూడు తరాల స్త్రీల ఆలోచన చెప్పే కథ. ఇంటిపని చేసే తనకు ఉద్యోగం లేక చేయి చాచే పరిస్థితిలో ఉందని బిడ్డ చిన్నదో పెద్దదో ఉద్యోగం చేయాలని ఆ తల్లి వసుంధరను ఉద్యోగస్థురాలిని చేసింది. ఇంటిపని, ఉద్యోగం, పిల్లల ఆరోగ్యం, భర్త తోడ్పాటు లేకపోవటం అన్ని ఒత్తిడులూ ఆమెకు అమ్మపైనా ఆడదానిగా తన బతుకు పైనా కోపాన్ని కలిగించాయి. ఆమె కూతురు మానసకు సంబంధం వచ్చినవాడు ఆమెను ఉద్యోగం చేయకూడదంటే వసుంధరకు ఆనందం కలిగింది. తనని పిల్లల్ని కనే యంత్రంగా, ఇంటి చాకిరి చేసే యంత్రంగా పడి ఉండమనే ఆంక్షను మానస నిరాకరించినా, సంపాదించే యంత్రంగా మూడో అవతారం ఎత్తమనటం లేదుగా అనుకొంది వసుంధర. ఇంటిపని పిల్లల పని వంటి తప్పనిసరి బాధ్యతలు. తప్పించుకోగల ఉద్యోగ బరువును దించుకోవచ్చుగా అని వాటి మధ్య నలిగిన వసుంధర అనుకొంది. మానస ఆర్థిక స్వేచ్ఛ కోసం ఉద్యోగం చేస్తాను అంది. మూడు తరాల ఆలోచనలను శాసించిన ఇంటిపని వైవిధ్య ప్రదర్శన ఈ కథ.

స్త్రీలపై ఆధిపత్య ప్రకటనకు పురుషుడికి పనికి వచ్చే బలమైన మార్గం లైంగికత. పురుషుడి ఆధిక్యతను స్త్రీ న్యూనతకు ఇది వాహిక కావడం సమాజ దౌర్బల్యం. ఆ స్త్రీ దళితురాలయితే అది మరింత స్పష్టంగా ప్రకటితమవుతుంది. దళితురాయిన సునీత, రెడ్డి కొడుకు అయిన రఘు ఇష్టపడ్డారు కలిసి తిరిగారు. ఆమె గర్భవతి అయ్యింది. అతను ముఖం చాటేశాడు. స్నేహానికి

ప్రేమకు మోహానికి పనికి వచ్చిన సునీత స్త్రీత్వం వివాహానికి అడ్డం అయ్యింది. కాలక్షేపానికి తిరిగానన్నాడు, పాకీ కొంపల్లో బతికేదానివి అని ఛీ కొట్టాడు. స్త్రీల పట్ల అందునా దళితస్త్రీల పట్ల ఈ అరాచకాలు పరిపాటి కావటం, స్త్రీలకున్న సున్నిత హృదయమే కారణం.

*ఈ కథల్లో కొన్ని స్త్రీ పాత్రలు స్వయం నిర్ణయాధికారం కలిగి ఉండటం కనిపిస్తుంది. వివాహ విషయంలోనూ భవిష్యత్ నిర్ణయించుకోవటంలోనూ ఇది కనిపించి, ఆయా పాత్రల పట్ల గౌరవభావం ఇనుమడిస్తుంది.*

ఈ కథల్లో కొన్ని స్త్రీ పాత్రలు స్వయం నిర్ణయాధికారం కలిగి ఉండటం కనిపిస్తుంది. వివాహ విషయంలోనూ భవిష్యత్ నిర్ణయించుకోవటంలోనూ ఇది కనిపించి, ఆయా పాత్రల పట్ల గౌరవభావం ఇనుమడిస్తుంది.

'బొమ్మల పెళ్ళి' కథలో మానస అవివాహిత, పెళ్ళి వయసు దాటుతున్న స్త్రీ. ఆమె సహద్యోగినులు, ఇటీవలే పెళ్ళైన జ్యోతి భర్త మరణించిన రాధ. తండ్రిలేని మానస తల్లితో అన్నా వదినలతో కలసి ఉంది. స్త్రీ ఉద్యోగం చేయటం ఏ మాత్రం గౌరవం కాదని వదిన ఉద్యోగ ఆలోచనను తుంచేసే అన్న, చెల్లి ఉద్యోగం చేయకపోతే ఆమెను తల్లి ఎలా పోషించేది అంటాడు. అతడి ద్వంద్వ ప్రవృత్తి అర్థం చేసుకొన్నాక, తనకు వివాహం చేసే యోచనలేని అన్న నుంచి విడిపోయి, అమ్మతో కలసి వేరుగా ఉండాలని నిర్ణయించుకొంది. పెళ్ళి అమ్మా, అన్నయ్యల బాధ్యత అని తను అనుకోవటం పొరబాటే అని తెలుసుకొంది. 'మూడో అవతరం' కథలో మానస తను ఉద్యోగం చేయకూడదని షరతు పెట్టిన వ్యక్తిని వివాహం చేసుకోనని ఖరాఖండిగా చెప్పింది. స్త్రీని గౌరవించని వాడిని వివాహం చేసుకోవటానికి నిరాకరించింది. 'గాజుకళ్ళు' లో లక్ష్మి వేశ్యావృత్తిలో హింసను తట్టుకోలేక కుళ్ళాయప్పతో వెళ్ళిపోయింది. 'మలుపు' కథలో దళిత స్త్రీ సునీత ప్రేమ పేరుతో తనపై లైంగిక దోపిడీకి పాల్పడి గర్భవతి అయ్యాక ముఖం చాటేసిన వ్యక్తితో తాము పెళ్ళి జరిపిస్తామని మహిళా మండలి వారు వస్తే, రాజీ అంటూ ఊర్లో వాళ్ళు వస్తే, రఘు లాంటి నీచుడిని పెళ్ళి చేసుకోనని తెగేసి చెప్పంది. పైగా షరతులు పెట్టింది.

ఈ పాత్రలన్నీ స్వీయ నిర్ణయం తీసుకొన్నవే. తమ జీవితాలపై పెత్తనాన్ని పక్కవారికి ఎవరికీ ఇవ్వకుండా నిర్ణయం తీసుకొన్నవే. 'కొత్త స్పర్శ' కథలో ఇందిర మరిది రవి, తను తన సహోద్యోగి సంధ్య కలసి ఉండబోతున్నట్టూ, అదే పెళ్ళిగా తాము భావిస్తున్నట్టు చెప్పాడు. సహజీవన నిర్ణయం వారిద్దరిదీగా ఉంది. ఇలా స్వీయ నిర్ణయ తీరును రచయిత్రి చిత్రించింది.

ఇన్ని కోణాలు ఎంచుకొన్న వస్తువుతో కథలో పొదిగి అందించింది రచయిత్రి.

కథా నిర్మాణంలో రెండు మూడు విషయాల కలనేత ఉంటుంది. బహుకథాంత పూర్ణంగా సంకీర్ణంగా ఉంటుంది. భిన్న విషయాలు సంఘటనలు, పాత్రలు ఒక కథలో ప్రదర్శించి వాటి మధ్య ఉన్న తేడాలను గుర్తింపచేసి మంచీ చెడు బేరీజును పాఠకులకు వదలటం రచయిత్రి రచనా శిల్పంలోని విలక్షత. తన ఇల్లు తమ్ముడి ఇల్లు రెంటి స్థితిని ప్రదర్శించి రెండు సందర్భాలలో ఒకే స్త్రీ ఎంత భిన్నంగా ఆలోచించిందో (వికసించిన అంతరంగం) చూపింది. మూడు భిన్న జీవితాలను చూపి, ఈ పురుష ప్రపంచంలో స్త్రీ ఎలా మనుగడ సాగిస్తుందో (బొమ్మల పెళ్ళి) చిత్రించింది. భిన్న పురుష నైజాల నేపథ్యం స్త్రీ జీవిత మార్గాలనెలా నిర్దేశిస్తాయో చాటింది. అన్ని కథలూ ఇలాంటి కథా నిర్మాణ వైఖరితోనే సాగాయి.

నిర్మలారాణి కథల్లో స్త్రీ ప్రధానంగా నడచిన కథల్లో స్త్రీలు దృఢ స్వభావం కలిగినవారు. తమను తాము తెలుసుకొన్న వాళ్ళు, తమ చుట్టూ పరిస్థితులు మారాలని భావించిన వారు. మార్చుకొన్నవారు. నమ్మిన దారిలో నిర్భయంగా నడిచారు. అలాంటి పాత్రలున్న కథలు 'వికసించిన అంతరంగం, గాజుకళ్ళు, ఎంతెంత దూరం, బొమ్మలపెళ్ళి, మూడో అవతారం, కొత్త స్పర్శ, మలుపు', ఇంత బలమైన స్త్రీ పాత్రలు ఉన్నట్టే బలహీనమైన స్త్రీ పాత్రలున్నాయి. అమానవీయంగానో, అతి మంచితనంగానో, పరమ స్వార్థజీవిగానో చాతకానితనంగానో కనిపిస్తాయి. "మానవత్వం"లో డబ్బు లేకపోతే వైద్యం చేయని లేడి డాక్టర్, ' దిగ్రేట్స్'లో మంచిది అనిపించుకోవాలనే బలహీనతతో మంచం పట్టిన మామకు సేవ చేస్తూ బిడ్డని వద్దని అబార్షన్ చేయించుకొన్న గృహిణి; 'అధిగమనం'లో వీధిలో తిరుగుతూ ఎవరేపని చెప్తే అది చేసే పిల్లలు తను కాన్పుకెళ్ళినపుడు ఎక్కడ దొంగతనానికి పాల్పడుతాడోనని, ముందుచూపుతో పసివాడిపై దొంగతనం నేరం మోపిన స్వార్థపరురాలు; 'మామూలు కత కాదు' వరకట్న వేధింపులో భాగంగా భర్త కిరసనాయిల్ పోసి అంటించినా ప్రమాదవశాత్తు జరిగిందని వాంగ్మూలం ఇచ్చిన అసమర్థ స్త్రీ పాత్రలున్నాయి స్త్రీలలో బలం బలహీన స్వభావాలు రెండూ రచయిత్రి

చిత్రించింది. ఇటువంటి బలహీనతను చిత్రించటమూ సమాజ చేతనకు అవసరం.

రచయిత్రి చాలా కథల్లో వాస్తవ స్థితిని చిత్రించింది. అటువంటి చోట సమస్య పరిష్కారం చూపలేదు. చూపే అవకాశమూ లేదు. కథాంశం పరిష్కార అవసరం లేనివి కూడా కూడా కారణమే. 'వికసించిన అంతరంగం, మానవత్వం, గాజుకళ్ళు, ఎంతెంత దూరం, దిగ్రేట్స్' వంటివి నిదర్శనాలు.

పరిష్కారం చూపిన కథలు ఉన్నాయి. 'గాజుకళ్ళు' లో పాక్షిక పరిష్కారంగా ఆ రొంపిలో నుంచి పారిపోయిన లక్ష్మిని చూపినా అది కథలోని సమస్యకు పరిష్కారం కాదు. 'బొమ్మల పెళ్ళి' లో వివాహం పట్ల తన ఆలోచన మార్చుకొంది మానస. ఆ ముగింపు లేదా పరిష్కారం బలంగా చిత్రితం కాలేదు. 'అధిగమనం'లో ఓ బాలుడు దొంగ కావటానికి కారణమైన భార్యపట్ల విరక్తితో ఆమె తండ్రి భిక్ష అయిన ఉద్యోగానికి రాజీనామా చేసి ఆమెను వదిలేయాలని నిర్ణయించుకొని ఆ బాలుడిని తన బతుకులను వెతుక్కొంటూ సీనప్ప వెళ్ళటాన్ని చిత్రించింది. ఇది స్పష్టత కలిగిన పరిష్కారం – 'కొత్తస్పర్శ' కథలో భర్త హింస నుంచి బయటపడాలని నిర్ణయించుకొంది ఇందిర.

'మామూలు కత కాదు, మలుపు' కథలు చాలా బలమైన ముద్ర వేయగల ముగింపులను పరిష్కారాలను చూపాయి. ఈ పుస్తకంలో 1992 నుంచి 2002 వరకు వచ్చిన కథల్లో రచయిత్రి పరిణతి గమనించవచ్చు. ఆలోచనల నైశిత్యం స్పష్టం. కథల పరిష్కార సూచనలోనూ స్ఫుటత కనిపిస్తుంది. 'మామూలు కత కాదు' లో భార్యను కిరసనాయిల్ పోసి చంపిన వాడిని పోలీసులు ఆధారాల్లేక వదిలేశారు కాని ఆఫీసులో ఎవరూ మాట్లాడకుండా వెలివేశారు. ఉన్న ఇల్లు ఖాళీ చేయమన్నాడు ఓనరు; ఇతరులు ఇల్లు ఇవ్వటానికి నిరాకరించారు. ముందు మెత్తగా ఉన్న అత్త కేసు పెట్టేలా ఉంది. ఇన్నింటితో ఇరుక్కుపోయిన సతీష్ ట్రాన్స్ఫర్‌తో హాయిగా ఉండవచ్చునుకొన్నాడు. అదీ వికటించింది. సాంఘిక బహిష్కరణ లాంటి వెలివేతను అన్ని కోణాల నుంచి చూపింది రచయిత్రి. స్వేచ్ఛగా బతికే అవకాశం లేని న్యూనస్థితి ఇటువంటి దుర్మార్గులకు శిక్ష.

***రచయిత్రులందరి రచనలపై సమగ్రంగా పరిశోధన చేయవలసిన అవసరాన్ని ఈ సందర్భం స్పష్టపరుస్తూ ఉంది. భవిష్యత్ పరిశోధకులకు ఇది ఉన్నతమైన, పరిశోధనాంశం కాగలదు.***

ఇలాంటిదే 'మలుపు' కథ. ప్రేమించిన దళితస్త్రీని వివాహానికి వద్దనుకొన్నాడు రఘు. మహిళామండలి వివాహం చేయటానికి, రఘు తరఫున రెడ్డి పిల్లాడికి సంబంధాలు వస్తున్నాయంటూ రాజీకి వచ్చారు. 'ఆధునిక రచయిత్రి పురుషాధిపత్యాన్ని ధిక్కరించే క్రమంలో లైంగిక హింసనీ ధిక్కరించింది. అందుకోసం ఎన్నెన్నో భయాల్ని, సంకోచాల్ని, అనవసర లజ్జని, ఆంక్షల్ని నిషేధాన్ని అధిగమించింది'. అన్న డా. పాపినేని శివశంకర్ (స్త్రీల కథల్లో లైంగిక సంబంధాలు, తెలుగులో స్త్రీల సాహిత్యం, సం. కాత్యాయని విద్మహే, పు.158) మాటలు వాస్తవం. సునీత కూడా ధిక్కరించింది కేవలం పురుషాధిక్యాన్నే కాదు. కులాధిపత్యాన్ని కూడా. ఆత్మాభిమానం గల సునీత తన బిడ్డకు తండ్రే అయినా, తనను పెళ్ళికి పనికి రాదన్న రఘును వివాహం చేసుకోను అంది. అతడిని సమాజం నుంచి వెలివేయమంది. ఏ అమ్మాయీ అతడిని వివాహం చేసుకోరాదు అంది. తాను పెళ్ళి చేసుకొంటాను కాని అతడిని కాదు అంది. బిడ్డను కంటాను అంది. పెద్ద మనుష్యులు రాజీకి రావటం ద్వారా, తన కడుపులో ఉన్నది రఘుబిడ్డేనని అంగీకరించినట్టు స్పష్టం అవుతూ ఉంది. కనుక బిడ్డకు అతడి ఆస్తిలో వాటా కావాలంది. పుట్టబోయే బిడ్డ బాధ్యత రఘు స్వీకరించాలని షరతులు పెట్టింది. ఇంత దృఢంగా ప్రతిపాదించిన షరతులలో న్యాయపరమైన చర్చ ఎలా ఉన్నా పరిష్కార మార్గాన్ని రచయిత్రి చాలా బలంగా పాఠకుల ముందుంచింది. మిగిలిన కథల్లో లేని దృఢత ఈ కథల్లో కనిపించింది. పదేళ్ళ కాలవ్యవధిలో రచయిత్రి ఆలోచనల పదునుకు ఈ కథలు సాక్ష్యం.

రాయలసీమ రచయిత్రులు మనసు కుటుంబం సమాజం చిత్రించటంలో ఆయా ఆవరణాలలోని భిన్న పార్శ్వాలను ప్రదర్శించగల దిట్టలు అటువంటి ప్రదర్శనా సామర్థ్యానికి నిదర్శనంగా నిలవగల కథలు 'గాజుకళ్ళు', రచయిత్రులందరి రచనలపై సమగ్రంగా పరిశోధన చేయవలసిన అవసరాన్ని ఈ సందర్భం స్పష్టపరుస్తూ ఉంది. భవిష్యత్ పరిశోధకులకు ఇది ఉన్నతమైన, పరిశోధనాంశం కాగలదు. ఆ దిశలో దృష్టి సారించవలసిన అవసరం ఉంది.

❋

# నేలమీద నక్షత్రాలు

- శిఖా ఆకాష్
7095874172



పనికిరావని పక్కన పెట్టడమే మేలైంది
వైకల్యాన్ని ఎగతాళి చెయ్యడమే బాగైంది
చెత్త ఊడ్చుడానిక్కూడా వద్దని ఎద్దేవా చేయడమే మంచిదైంది
నానా చెత్త పేరుకు పోయిన అల్పబుద్ధుల ముందు
మహాబోధి వృక్షాలై మీరు
మనోవైకల్యంతో కూరుకుపోయిన కురచ బుద్ధుల ముందు
లోకానికి వెలుగునిచ్చే సౌందర్యగుణదీపాలై మీరు
సోమరి ఆలోచనల్లో మగ్గిపోయే కుళ్ళుమోతుల ముందు
లోకాన్ని పరిమళింపజేసే సుగంధిత స్వప్నాలు మీరు
స్వప్నం సాకారమయ్యే రహస్యం తెలిసిన జీవనోత్సాహ సిరులు
మీరు
జీవితోత్సవ చిరునామాలు మీరు
వివేచనా సంకల్పానుభూతుల స్వర్గం మీరు
సంస్కృతీ వికసిత కుసుమాలు మీరు
రూపలావణ్య దృశ్య సంగీత స్వరాలు మీరు
మిము వరించి వచ్చిన శారద ముందు లోకమే సాగిలపడదా?!
చైతన్యదీప్తియై నిలచిన మీ లక్ష్యం ముందు
ఏ చీకటి శక్తియైనా పారిపోదా?
జ్ఞాన సమున్నతాశయ శిఖరం ముందు
ఏ దేశమైనా పొట్టిదై పోదా?
అధిమానవ శక్తులారా!
మనోవైకల్యమే జీవన విధానంగా బ్రతుకుతున్న లోకంలో
మీరు అంగవికలురుగానే కన్పిస్తారు!
ఎవరు గుర్తించగలరు? సంకల్పశక్తులైన మిమ్మల్ని?
దయార్ద్ర, సౌహార్ద్ర భావకులను ఈ స్వార్థలోకమెలా
ప్రేమించగలరు
వెన్నెల్లో ఆడుకునే ఆడపిల్లలు కాదు మీరు
నిరంతరం సాధకులై జీవితపు కత్తివాదనపై నడుస్తున్న
కార్యదీక్షా తత్పరులు పోరాటధీరులు అసాధారణ దివ్యజ్యోతులు
ఆత్మ విశ్వాసపు జీవన సౌరభాలు
స్వార్థలోకం ఈసడించిన పురుషాహంకార ఊర్ధ్వపీఠం
ఘీంకరించినా
పోరాట రూపమే మీకు వెలుగౌతుంది
సుందర మార్గమే మీకు దారి చూపుతుంది
మీరే దీపదారులౌతారు
చరిత్ర ప్రేమించేంత మహాసౌందర్య రాశులుగా ప్రకాశిస్తారు
మట్టిలోని మాణిక్యాలు మీరు
అల సెంద్రవంకలు మీరు
నేలమీది తారకలు మీరు
నింగినైనా నేలకు దించగల విజయాలబాటలు మీరు
చీపురుపట్టి తుడిచే స్వీపరుగానైనా పనికిరారా?
చూద్దాం..... ప్రపంచం కాళ్ళకాడ మీరుంటారో....
మీ కాళ్ళ వద్దకు ప్రపంచం వస్తుందో.....?

**(2014 ఆల్ ఇండియా సివిల్స్ టాపర్ ఇరా సింఘాల్, దేశంలోనే మొట్టమొదటి అంధ ఐ.ఏ.ఎస్. అధికారి బెనో జెఫిన్‌లకు ప్రేమతో....)**




# పూర్వీకుల ఎముకలు


కన్నడం: సి.వి. శేషాద్రి
అనుసృజన - వేలూరి కృష్ణమూర్తి
9448977877


మా పల్లెలో వున్న నా స్నేహితుడికి ఫోన్ చేశా. కాని, పల్లెవారందరూ వారి భూములను పట్టణాలలో వుంటున్న పరిశ్రమ వారికి విక్రయం చేసేశారట. కావాలంటే వచ్చి ఊరిముందరి చెరువులో తండ్రి శవాన్ని పూడ్చవచ్చునన్నాడు. కొంత సమయం తరువాత అతనే ఫోన్ చేసి, చెరువులోనూ పూడ్చడానికి వీలులేదు. అక్కడ ప్రభుత్వం వారు బస్టాండ్ నిర్మిస్తారట. అందువల్ల అక్కడే ఏదైనా ఏర్పాటు చేసుకోమన్నాడు.

'ఎలాంటి దరిద్రపుకాలం వచ్చిందండీ. జీవించడమూ కష్టకరమే, చనిపోయినా కష్టమే'. అలా అయిపోయినది కాలం. నా భార్య హతాశురాలైంది. పడసాలలో శవాన్ని వుంచుకొని భార్యభర్తలు చర్చిస్తున్నారు. వారి చిన్న పిల్లలు కొంతసేపు ఏడ్చి, ఏడ్చి చాలనిపించినదేమో క్రికెట్ మ్యాచ్ చూడసాగారు. శవాన్ని కడచూపు చూడడానికి రావాల్సిన వారందరూ వచ్చి చూచి వెళ్ళిపోయారు. వారి వారి దిననిత్యపు పనులలో వారు చాలా బిజీగా వుండడంతో 'మీ కర్మ, మీ బాధ మీరు పడండ' ని తాము వెళ్ళిపోయారు.

తన భర్త తండ్రిగారిది ఆ శవం. మొన్నటిరోజు చనిపోయాడు. చాలా దీర్ఘ అస్వస్థతతో చనిపోయాడు. 'కొద్దిగా చెడ్డవాసన వస్తున్నది కదా'? భర్త అన్నాడు.

'శవం వాసన కొట్టదేమండీ? బ్రతికి వున్న మనుష్యుడే వాసన కొడ్తాడు. అలాంటిది యిక శవం వాసన కొట్టదా? వాసనను తరువాత ఆఘ్రాణించవచ్చు. మొదలు శవ సంస్కారానికి కావాల్సిన ఏర్పాటు చూడండి. అంగీకున్న చేతులు, టవళ్ళు, కర్చీపులు, చీర చెరగులు ఏడుస్తున్న వారి కన్నీళ్ళను పీల్చి పీల్చి వారి కన్నులను ఖాళీ చేశాయి. తన భర్త స్నేహితుడు ఒకటి, రెండు అంబులెన్స్ నంబర్లను ఇచ్చాడు. ఫోన్ చేయగా ఆ వైపు నుండి వచ్చిన జవాబిలా వుండినది.

'లేదు సార్, ఇపుడు పట్టణంలో ఎలాంటి స్మశానాలూ లేవు. వాటినన్నిటినీ ఆయా జాతి సంఘాలవారు అమెరికన్ కంపెనీలకు అమ్మేశారు. ఇపుడు అక్కడంతా పెద్ద పెద్ద మాల్‌లు కడుతున్నారు. వేరే ఎక్కడైనా ఏర్పాటు చేసుకోండి'. మీ మరొక స్నేహితుడు ఈ పట్టణం ప్లానింగ్ ఆఫీసర్‌గా వున్నాడు కదా? అతనికి ఫోన్ చేయండని భార్య అన్నది. ఆ ప్లానింగ్ ఆఫీసర్ యిలా జవాబిచ్చాడు. 'ఛ, పాపం, మీ తండ్రిగారు ఎంత మంచి మనిషి. నాకు చాలా దుఃఖం కలిగినది. అతడి చావు విషయం తెలిసి, కాని, యిపుడు ఈ పట్టణం చుట్టు ప్రక్కల ప్రదేశం మాత్రమే కాదు, పూర్తి రాష్ట్రమేమిటి, దేశంలోని అన్ని భూములూ

'సైట్లు' అయిపోతున్నాయి. కొన్నిచోట్ల చిన్న చిన్న కర్మాగారాలవారు ఖరీదు చేసి చుట్టూ గోడకట్టి వుంచారు. శవాలను పూడ్చడానికి ఎక్కడా భూమన్నదే లేదు. నీకు తెలియదా, ఇపుడు శవాలదే ఒక పెద్ద సమస్య అయిపోయినది. మరికొన్ని చోట్లంతా కార్లు, విమానాల నిర్మాణానికని విశాలమైన భూములనే కొనేశారు. అడవులలో శవాలను పారవేయడమన్నది ఒట్టి నీ కల మాత్రమే. ఏవో పాత సినిమాలలో మాత్రమే నీవిపుడు అడవులను చూడగలవు. ఏమన్నావు? ఎడారిలోనంటావా?



'అక్కడ ఇప్పటికిపుడు అక్కడవున్న ఇసకనంతా భవనాల నిర్మాణానికై అపుడే విక్రయించేశారు. అందుకే గదూ ఒక పెద్దదైన 'సైటు' కొనుక్కోమ్మని సలహా యిచ్చా కదా నీకు. ఇంకోసైటు మరొకచోటు కొనిపెట్టి వున్నట్టయితే అచట తమ స్వంత స్మశానం నిర్మించుకోవడానికి వీలవుతుంది. ఇపుడు అందరూ అలానే చేస్తున్నారు. నీకు మరో ముఖ్యవిషయం తెలియదనుకొంటా. కొద్దిరోజులు ఆగు ప్రభుత్వమే భూమిలో ఒక పాతాళాన్ని నిర్మిస్తారట. అపుడు అందులోనికి బంధువుల శవాలను పారవేయవచ్చునట! 'అతను చెబుతున్న ప్రణాళిక ఎపుడు చేస్తారో ఏమిటో? ఇపుడు మన సమస్య సంగతి చూడండి'. భార్య కోపగించుకొన్నది.

అంతలో ప్రక్కయింటివారు వచ్చి, 'సాధ్యమైనంత త్వరగా మీ తండ్రి శవాన్ని పూడ్చివేసే ఏర్పాటు చేయండి. లేకుంటే ఈ దుర్గంధపు వాసనను తట్టుకోవడం కష్టం. రేపటిరోజు మా యింటిలో, 'ఎంగేజ్‌మెంట్ వున్నది. బంధువులంతా వస్తార'ని కొంచం గడుసుగానే చెప్పి వెళ్ళారు.

తన భర్తకు కోపం వచ్చి, 'మీ తల్లి, తండ్రి లేక, బంధువులెవరూ చనిపోరేమండి? అని అందామనుకొన్నాడు. కాని జీవితమంతా భయభక్తులతో బ్రతికినవారు, ఏ ఒకరికీ ఎదురుత్తరమీయనివారు, కోపాన్నీ, దుఃఖాన్నీ అలాగే కలుపుకొని మ్రింగివేశాడు. నాలుగవరోజు మెల్లగా వీస్తున్న దుర్గంధపు వాసన ఐదవ రోజుకు ఉధృతమైనది.

ఇప్పటివరకు మొదటిక్రాస్ వరకే పరిమితమైన ఆ దుర్వాసన, యిపుడది నాలుగైదు క్రాసుల వరకు విస్తరించినది. మెయిన్ రోడ్డుకు కూడా దూసుకుపోయినది. ఎన్ని బట్టలను కట్టి కప్పినప్పటికీ శవం యొక్క దుర్వాసన పట్టణంలోని ప్రసిద్ధిగాంచిన మాన్ హోల్స్‌మీద పడినంత తీవ్రం అనిపించేటటువంటి జాత్రలాంటిది జరిగినది.

ఆమె భర్త ఒకటి రెండు పెద్ద పెద్ద ఆస్పత్రుల శవాగారాలకూ వెళ్ళొచ్చాడు. కాని, అన్ని చోట్లా ఒకే జవాబు. 'మనిషి మరణించే వరకే మా బాధ్యత. ఆ తరువాత ఆ శవానికి మేము భాద్యులం కాము'.

వారి ఇంటిముందు చాలమంది చేరారు. వారి గలభా తీవ్రమైనది. అందరూ వారి వారి కర్చీఫులను ముక్కులకు అడ్డంపెట్టి తమ తమ ముక్కు సూటిగా మాట్లాడిపోయారు.

శవం దుర్వాసన బయటికి పోకూడదని ఇంటి కిటికీగాజు తలుపులన్నీ మూసివుంచి, భార్యభర్తలిరువురూ ఇంటి ముందరి మెట్లపై కూర్చొన్నారు. వారు చూస్తున్న క్రికెట్ ఆట ముగియటంతో పిల్లలు కూడా వచ్చి వారితో చేరారు.

వీధికిరువైపులా వున్న జనులు రెచ్చిపోయారు. వీరి ఇంటికి ఎదురుగా ఒక నూతన గృహాన్ని నిర్మిస్తున్నారు. అప్పుడే ఒక లారీ లోడ్ జెల్లీ రాళ్ళను ఆ ప్రదేశంలో కుమ్మరించి పోయింది. శవం దుర్వాసన వలన తమకు కలిగిన కోపాన్ని తగ్గించుకోవాలని అక్కడ చేరిన జనం జల్లీ రాళ్ళు ఎన్ని వున్నాయని లెక్కవేయసాగారు తమ చేతివ్రేళ్ళతో. వారి చేతి వ్రేళ్ళు రకరకాలుగా వుండినవి – కొన్ని వీణను వాయించడం నేర్చినవి. కొన్ని హార్మోనియం నడిపించేవి. కొన్ని మందులు పంచిపెట్టే చేతివ్రేళ్ళు, నల్లటి పలకమీద అక్షరాలు అద్దేవ్రేళ్ళు, గేరు స్టీరింగ్ పట్టడంలో మంచి తర్ఫీదు పొందాయి అవి. శవం వున్న ఇంటి మీదకి 'రుయ్, రుయ్' మని పడుతున్నాయి ఆ జల్లీరాళ్ళు. ఆ ఇంటి కిటికీ గాజు పలకలు ఎండిన పిండినలాగా ముక్కలై క్రింద పడసాగినవి. ప్రపంచమంతా వెదజల్లగల దుర్వాసనను అదిమిపెట్టి వున్న ఆ గాజు కిటికీలు ఓడిపోయి తలలు వంచినవి. అవి అలా తల వంచిన వెంటనే శవం దుర్వాసన పట్టణం పూర్తి, సందు గొందులతో సహా ఆటో రిక్షాలు పరుగెడుతున్నట్టు ఆటలాడుకొంటూ దూసుకుపోయినవి.

ఇది ఏ దిక్కు, అది ఏ దిక్కు అని తెలియని అక్కడి జనులు నలుదిక్కులకు పారిపోసాగారు. ఆ పట్టణంలోని చాలా ప్రతిష్టవంతులు, అలాగే తామే శిఫార్సులను సృష్టించుకొన్నవారు వుండటంతో, ప్రభుత్వం ఆ రోజే ఒక క్రొత్త చట్టాన్ని సృష్టించి జారీ చేసినది. దాని సారాంశం: తమ తమ వారి శవాలను తాము నివశిస్తున్న స్థలంలోనే పూడ్చిపెట్టాలని లేక దహనం చేయాలని, ఆ చట్టాన్ని జారీ చేసిన కొద్ది గంటలలోనే ఒక పోలీసు అధికారి తన ముక్కుకు ప్రభుత్వం జారీ చేసిన పత్రం కాపీని అడ్డం పెట్టుకొని అక్కడికి వచ్చాడు. కన్ను తెరిచి మూసేలోగా, ఆ పత్రాన్ని, శవం ఇంటి యజమాని చేతిలో వుంచి పారిపోయాడు.



నోట్ల కట్టలతో తనను తాను దహించుకొంటే ధగధగ మండుతున్న ఆ పట్టణంలో ఎన్నో ఏళ్ళు సహజీవనం గడిపిన ఆ దేహం పూర్తిగా దగ్ధం కాలేదు. దాని చేతివ్రేళ్ళు యింకా కదులుతుండినవి. ఒకరిద్దరు ఆ భార్యభర్తల సహాయానికి వచ్చారు. చివరికి వారి పడసాలలోనే శవాన్ని పూడ్చిపెట్టాలని నిర్ణయించారు, సోఫా, కుర్చీలు, టివిలాంటివి, వాటి స్థలాల నుండి కదిలాయి. కొండలను చీల్చి అందంగా తయారుచేయబడిన గ్రానైటు బండలను యంత్రాలతో కత్తిరించి చిన్న చిన్న పలకలుగా తీసి, చిన్న చిన్న ముక్కలుగా చేసి బయటకు పారవేశారు. బయట నిలిచివున్న జెసిబి యంత్రం తన రాక్షస హస్తాలను ఇంటిలోనికి చాచింది. కళ్ళు మూసి తెరిచేలోగా ఒక గుంత తయారైపోయింది. చివరకు, ఆ శవానికి ముక్తి లభించింది.

ధూమపానం చేసేవారు, చేయనివారు అందరూ తమ చేతులలో అగరుబత్తులను పట్టి పోరాడసాగారు. శవాన్ని పూడ్చిన కార్యం అయిన వెంటనే చేతులలోని మండుతున్న అగరుబత్తులను విసరివేశారు. పట్టణం పూర్తి మాంసపువాసన పీల్చి, పీల్చి చేతిలో మండుతున్న అగరబత్తుల మంట చూచి చూచి మతి చెడిన జనులు తాత్కాలికంగా తృప్తిచెందారు.

మరలా చీకటి అలముకొన్నది. ఆ ఇంటివారికి మాత్రం ఆ చీకటి చాలా హితంగా వుండినది. దుర్వాసన లేదు. శవం సునాయాసంగా యింటిలోని మట్టిలో నిద్రపోతున్నది. నెమ్మదితో కూడిన నిట్టూర్పు విడిచిన భార్యభర్తలు, పిల్లలు, శవాన్ని పూడ్చిన ప్రదేశం పైననే పడుకొన్నారు. మరుసటి రోజు అపుడు తానే బడికి బయలుదేరుతున్న అబ్బాయి తన తండ్రిని ప్రశ్నించాడు. 'ఇకమీదట చనిపోయే మన వారిందరినీ ఈ ఇంటిలోనే పూడ్చాలి కదా' ?

'ఔన' ని జవాబిచ్చిన ఆ అబ్బాయి తండ్రి తలలో ఏవేవో బొమ్మలు కనిపించసాగాయి. అబ్బాయి మరలా ప్రశ్నించాడు. 'అలా పూడ్చుతూపోతే.....?'

తండ్రి : 'మొదట పూడ్చిన వారి శవాల ఎముకలు దొరకుతూంటాయి'.

అబ్బాయి : 'ఆ ఎముకలను ఏం చేయాలి'?

తండ్రి : 'అటక మీదకు విసరివేయాలి'.

అబ్బాయి : 'అక్కడ కూడా తగినంత స్థలం చాలకపోతే?'

తండ్రి : 'క్రొత్త క్రొత్త డిజైన్స్ వేసి వాటిని వ్రేలాడదీయాలి'.

అబ్బాయి : ' ఆ తరువాత'?

తండ్రి : 'మున్ముందు ఒకరోజు అన్ని విజ్ఞానపరమైన ఆవిష్కారాలు బహిష్కారం చెందినపుడు అన్ని రకాల కృత్రిమ శక్తులూ నశించిపోయి భూమినిండా మరలా మట్టి దీపాలు పనిచేయడం ప్రారంభించి యీ ఎముకలు ప్రకాశించడం ప్రారంభిస్తాయి.

అబ్బాయి : 'ప్రకాశించి ఏం చేస్తాయి'?

తండ్రి : దేశాన్ని, ద్వేషాలనూ తూకమేస్తాయి.

అబ్బాయి : 'తూకమేసిన వాటిని ఎవరు కొంటారు'?

తండ్రి : యుద్ధం వచ్చి కొనుక్కొంటుంది.

అబ్బాయి : 'కొన్న తర్వాత'?

తండ్రి : అందరూ వారి వారి పూర్వీకుల ఎముకలను చేతిలో పట్టి వీధిలోనికి వస్తారు, యుద్ధసన్నద్ధులై!

❋

## న్యాయం

దుర్లభ వస్తువులు అందరికీ దొరకవు.
అందుకే, న్యాయం కూడా అందరికీ ఎలా దొరుకుతుంది?
న్యాయమైనా ఇచ్చే వస్తువా,
ప్రతి అడ్డమైన వాడికి ఇచ్చేయటానికి !
న్యాయం సల్మాన్, శశిథరూర్, జయలలిత వగైరా లాంటి....
ఏదేని ప్రత్యేకమైన వారికి,
ఇంకా చెప్పాలంటే అత్యంత ప్రత్యేకమైన వారికి
ఖరీదైన కానుక.

సామాన్యుడైతే కేవలం ఆశిస్తాడు,
వాడు ఆశలోనే జీవిస్తాడు,
ఆశలోనే మరణిస్తాడు.

న్యాయం మామూలుగా కూడా
ఖరీదైన వస్తువు
పాపం పేదవాడు, పప్పుకే దిక్కు లేదు,
న్యాయం కూడానా?!
అమ్మో ! ఆశ, దోస, అప్పడం !



- కరణ్‌సింగ్ జైన్

హిందీ నుండి తెలుగు:
**వేదుల రామకృష్ణ**
**9989033403**

## కొనుగోలు

కారులో వచ్చాడు
హుకుం వేశాడు
సంచి విసిరాడు
పర్సు విప్పాడు
అడిగిన రొక్కం చెల్లించాడు
నిండు సంచి తీసుకుని
కదిలి వెళ్ళాడు



ఉట్టి కాళ్ళపై వచ్చాడు
బజారంతా చుట్టుముట్టాడు
ధర అడిగాడు
జేబు సవరించుకున్నాడు
నిరాశ పడ్డాడు
చిరిగిన పాత ఖాళీ సంచితో
వచ్చినట్టే గుడిసెకి వెళ్ళాడు

- సూరజ్ మహతో

## మార్పు

మీరొక సరుకని నేనంటే
మీరు నొచ్చుకుంటారా? కాదు కదా!
ఎందుకంటే సరుకు ఎల్లప్పుడూ సరుకే కాదు.
ఉదాహరణకి మన దేశంలో
రెండు సరుకులు బాగా పుట్టుకొస్తున్నాయి.
ఒకటి రకరకాల దేవుళ్ళు,
రెండవది వివిధ అస్తిత్వాల మనిషి.
ఇందుకు మీరు కోపగించుకుంటారా? లేదు.
దీర్ఘంగా ఆలోచిస్తారు,



దేవుడు ఎలా మారుతున్నాడు,
సరుకుగా
ఎందుకంటే దేవుడు కంటే ముందు
మనిషే మారుతున్నాడు సరుకుగా.

- కుశేశ్వర్

# తెలుగు నేలపై కన్నడ శాసనాలు : కరీంనగర్ జిల్లా



డా॥ ఈమని శివనాగిరెడ్డి
9848598446

తెలంగాణా రాష్ట్రంలోని కరీంనగర్ జిల్లాలోని మునుపటి హుజూరాబాద్ తాలూకాలోని జమ్మికుంట, కోరట్ల,సిరిసిల్ల తాలూకాలోని వేములవాడ. జగిత్యాల తాలూకాలోని పొలవాస, కరీంనగర్ తాలూకాలోని కరీంనగర్, కాడపర్తి, కుర్యాల, చొప్పదండి, నగునూరు, పొట్లపల్లి, రేపాక, శనిగరం, హుస్నాబాద్‌లలో వేములవాడ చాళుక్య, కల్యాణి చాళుక్యరాజులు విడుదల చేసిన 24 కన్నడ శాసనాలున్నాయి. కరీంనగర్‌లోని క్రీ.శ.946వ సం॥పు వేములవాడ చాళుక్యరాజైన రెండో అరికేసరి విడుదల చేసినది, తొలిశాసనం కాగా, శనిగరంలోని క్రీ.శ. 1149 వ సం॥పు కళ్యాణ చాళున్య రాజైన రెండో జగదేకమల్లుని సామంతుడు కాకతీయ ప్రోల రాజు విడుదల చేసినది. చివరి శాసనం. శాసనాల వివరాల్లోకెళదాం.

కరీంనగరులోని వేములవాడ చాళుక్యరాజైన రెండో అరికేసరి శాసనంలో రాజవంశ వివరాలతోపాటు, రాజు నూతులపాదుకు చెందిన ధార పయ్య అనే బ్రాహ్మణునికి అటిపసీపల్లి గ్రామాన్ని క్రీ.శ. 946వ సంవత్సరంలో దానం చేసినట్లుగా ఉంది. శాసనంలోని 1-29 పంక్తుల మధ్య గల ఐదు పద్యాలు పంపని విక్రమార్జున విజయంలోనివి కావడం గమనించాల్సిన విషయం.

క్రీ.శ. 10 వ శతాబ్దికి చెందిన కుర్యాలలోని బొమ్మలమ్మగుట్ట శాసనంలో రెండో అరికేసరి బోధన పట్టణం నుంచి పాలిస్తున్నట్లు, కన్నడ కవి పంపని సోదరుడైన జనవల్లభుడు, బోధన్‌లో త్రిభువన తిలక అనే జైనబసదిని, **కవితాగుణార్ణవ** అనే చెరువును, **మదనవిలాస** మనే ఉద్యానాన్ని నిర్మించిన విషయాలున్నాయి. జనవల్లభుని పూర్వీకులు వేంగినాడులోని వంగిపర్రుకు చెందిన **కమ్మబ్రాహ్మణ** కులానికి చెందిన వారని చెప్పబడింది. **ఈ శాసనం కన్నడ, సంస్కృత, తెలుగు భాషల్లో ఉండటం ప్రత్యేకత.** క్రీ.శ. 968, ఫిబ్రవరి 14, శుక్రవారం నాటి వేములవాడ చాళుక్యరాజైన మూడో అరికేసరి విడుదల చేసిన రేపాక శాసనంలో వుజయగావుండ అనే మాండలికుడు ఆ గ్రామంలో ఒక జినాలయం ఎత్తించి, కొంత భూమిని దానం చేసినట్లు, అదే శాసనంలోని సంస్కృత భాగంలో, జైనధర్మానుయాయులు ఆతుకూరు-70 పమ్మి-12ను పాలిస్తున్న వారు, రామ, తుక్కయ, రేమ పుణ్యరామ, మామ్మియల వివరాలున్నాయి.

కరీంనగరు మ్యూజియంలో నున్న క్రీ.శ. 992, మార్చి 7 సోమవారం నాడు విడుదల చేసిన కళ్యాణ చాళుక్య రాజైన ఆహవమల్ల దేవుని శాసనంలో, ఒక సైన్యాధిపతి (శ్రీశైలంలోని) మల్లికార్జున దేవరదేవాలయాన్ని సైన్యంతో సహా సందర్శించి, స్థానిక మహాజనుల సమక్షంలో కొంత నీనుర్నేల(మాగాణి), పూలతోటను, దేవుని సేవ కోసం ఇచ్చినట్లు చెప్పబడింది. చొప్పదండి గ్రామం శివారులో నున్న క్రీ.శ. 992 జూలై 3 వ తేదీ, ఆదివారం నాడు, కళ్యాణీచాళుక్య రాజైన అహవ మల్లదేవుని పాలనా కాలంలో, దుగ్గరయ్య కుమార్తె ఆచబ్బి పేరుతో చొప్పదండిలో ఆచబ్బె సముద్రమనే చెరువును తవ్వించటానికి, 70 ద్రమ్మలను ఇచ్చినట్లు చెప్పబడింది.

ఇందులో ఇళవబెడుంగ సత్యాశ్రయుని దేవకబ్బె ప్రస్తావన కూడా ఉంది.

జమ్మికుంటలోని శివాలయం ముందున్న స్తంభంపై గల క్రీ.శ. 995, ఏప్రిల్ 5వ తేదీ శుక్రవారం నాటి అహవమల్లదేవ రెండో తైలపుని శాసనంలో ఆహవమల్లుడు ఉత్తర దిగ్విజయయాత్ర చేసి తిరిగి వచ్చినప్పుడు, అతని ప్రధానులు మేడెయుగావుండ, నాగాయగావుండలు జమ్మికుంటలో ఒక దీపస్తంభాన్ని ఎత్తించినట్లు చెప్పబడింది. నాగయగావుండ తాను కట్టించిన తైలేశ్వర, ఆదిత్యణాహమనే ఆలయాలను రెండు మత్తర్ల నీరునేల, 10 మత్తర్ల వెలిభూమిని ఇంకా మూలస్థానానికి 120 మత్తర్ల భూమిని, రెండు రాట్నాలను కూడా దానం చేసినట్లు చెప్పబడింది.

**_శనిగరంలోని క్రీ.శ. 1107, జనవరి 10వ తేది, గురువారం నాటి శాసనంలో త్రిభువనమల్ల దేవుని సామంతుడైన అనుమ కుండ పురవరేశ్వర, మరో మండలేశ్వర కాకతీయ బేతరస విడుదల చేసింది._**

వేములవాడలోని చెరువుకట్ట మీదున్న విరిగిన శిలా శాసనంలో చోళదేశాన్ని జయించిన అవహమమల్ల దేవుని ప్రస్తావనలో ఒక మహామండలేశ్వరుడు, మహేశ్వరశక్తి పండితుడనే ముని కాళ్ళు కడిగి, తపోధనుల కోసం కొంత భూమిని దానం చేసినట్లుగా నమోదైంది. క్రీ.శ. 1005, మార్చి 7వ తేదీ, గురువారం నాటి కొడవర్తి ఇరివబెడంగ సత్యాశ్రమ శాసనంలో, మండిగావుండ కొడుకు వళధువయ్య అభ్యర్థనపై అర్మకుండ (హనుమకొండ) -7000, కాడిపాళు -70లో వచ్చే సద్దాయాన్ని దానం చేసినట్లు చెప్పబడింది.

చొప్పదండిలోని క్రీ.శ. 1008, ఏప్రిల్ 11, ఆదివారం నాటి శాసనంలో, ఇరివబెడంగదేవుని దాది దేవకబ్బె దేవకేశ్వరునికి చొప్పదండిలో కొంత భూమిని దానం చేసినట్లు చెప్పబడింది. క్రీ.శ. 11వ శతాబ్ది నాటి కోరట్లలోని చాళుక్య రాజైన త్రైలోక్యమల్ల దేవుడు కళ్యాణపురం నుంచి పాలిస్తుండగా, పద్మనంది సిద్ధాంతదేవుడు ఆచార్యునిగా నుండగా మహామండలేశ్వర లట్టలూరుపురవ రాధీశ్వరదురట్ట మార్తాండ జినాలయానికి కొంత భూమిని దానం చేసినట్లునూ, చివరన కానూరు గణం తింత్రిణీ గచ్ఛకు చెందిన కారవట్టు (కోరుట్ల) గోష్ఠి ప్రస్తావన ఉంది.

వేములవాడ భీమేశ్వరాలయంలో నున్న క్రీ.శ. 1051, డిసెంబరు 25 నాటి త్రైలోక్యమల్ల దేవుని సామంతుడైన కాకతీయ బేతరస శాసనంలో అతని మంత్రి నారనయ్య శనగరంలోని దుద్దమల్లజినాలయాన్ని జీర్ణోద్ధరణ చేసి, స్థానిక గావుండవైశయుప్పడయ్య పున్నిరెడ్డిల సమ్మతితో ఒక ఈ రాట్నాన్ని బహుకరించాడనీ ఈ శాసనాన్ని సేనబోవ జక్కమయ్య రాశాడనీ చెప్పబడింది.

వేములవాడలోనే పొలాల్లో ఉన్న మరో క్రీ.శ. 1053, నవంబర్ 13, ఆదివారం నాటి చాళుక్య రాజైన త్రైలోక్యమల్ల దేవుని మహాసామంతుడైన కాకతీయ ప్రోలరాజుకు చెందిన శాసనంలో స్థానిక గావుండల సమ్మతితో, 12 నివేశన స్థలాలు, ఒక రాట్నం, ఒక నూనె గానుగ, 20 మత్తర్ల నల్లరేగడి, కీసుకాడు, బెజవాంక కోటిరెడ్డి సమ్మతితో బండిశనిగరంలో పెర్గడ మధువప్పయ్య ప్రతిష్ఠించిన మధూపీశ్వర దేవునికి దానం చేసినట్లు చెప్పబడింది. ఈ శాసనాలను దాణయ్య రాశాడు.

పొట్లపల్లి రామాలయంలోనున్న క్రీ.శ. 1066, మార్చి 14, మంగళవారం నాటి త్రైలోక్యమల్లదేవుని మరో సామంతుడు రేంగొండెకు చెందిన చందయ్యరస పంచుమర స్థానంలో నున్న నకరేశ్వరుని దేవాలయానికి ఒక రాట్నాన్ని బహుకరించినట్లు చెప్పబడింది. వేములవాడ రాజరాజేశ్వరి దేవాలయం ముందున్న క్రీ.శ. 1083, డిసెంబర్ 25 నాటి శాసనంలో కొసవళలోని సబ్బి 21000ను పాలిస్తున్న మహామండలేశ్వర రాజాధిత్యుడు వేములవాడలో రాజాదిత్య ఆలయాన్ని కట్టించి, కురుమ, సంకెయపల్లి గ్రామాలను వేంబులవాడ పరమేశ్వరదత్తిగా, దేవుని సేవకు, తాపసులు, అచార్యుల భోజనం కోసం దానం చేశాడు. ఈ శాసనాన్ని మహామండలేశ్వర రాజాధిత్య దేవర స్వహస్తాలతో రాయటం విశేషం.

శనిగరంలోని క్రీ.శ. 1107, జనవరి 10వ తేది, గురువారం నాటి శాసనంలో త్రిభువనమల్ల దేవుని సామంతుడైన అనుమ కుండ పురవరేశ్వర, మహామండలేశ్వర కాకతీయ బేతరస విడుదల చేసింది. ఇందులో మహా మండలేశ్వరుడైన జగద్దేవరసుని దండనాయకుడైన కొండమయ్య, స్వయంభూభీమేశ్వర దేవునికి, పుల్గునూరు-70లోని శనగర ప్రభువైన రాలెయగావుండ సమ్మతితో కొంత భూమిని, ఒక రాట్నాన్ని దానం చేశాడని చెప్పబడింది. ఈ శాసనాన్ని దామరస రచించాడు.

వేములవాడలో నున్న క్రీ.శ. 1108, ఏప్రియల్ 26, ఆదివారం నాటి మహామండలేశ్వర జాగాదేవరస శాసనంలో

# మార్పుకోసం ధైర్యంగా

- శాంతిశ్రీ
8333818985



తడి తగులుతోంది
అది వాన్నీళ్ళదో.. కన్నీళ్ళదో..
సువాసన వేస్తోంది
అది పువ్వులదో.. ప్రకృతిదో..
చెట్టు ఊగుతోంది
అది రెమ్మదో.. దాని చివరనున్న పువ్వుదో..
హోరు వినిపిస్తోంది
అది వీచే గాలిదో.. సముద్రపు అలలదో..
నాలో స్పందనున్నా విచక్షణ అవసరమంటూ

రాళ్ళలాంటి పెళుసు సంఘటనలు
రక్తం చిందించే వికృత చేష్టలు
నన్ను ముసిరేస్తున్నాయి.. ముప్పిరిగొంటున్నాయి
సుడిగుండాల్లో మునిగిపోతున్నట్లు
వలయాలు వలయాలుగా నన్ను చుట్టేస్తున్నాయి
బయటపడకపోతే బతకలేనంటూ

బయటికి.. లోపలికి అటూ.. ఇటూ
తోసేస్తూ.. తోసుకొస్తూ ..
జీవిత గడియారంలో కాలమనే లోలకం
నిరంతరంగా కవాతు చేస్తూనే ఉంది
నాకు నిత్యచైతన్యం అందిస్తూ

ఈ కుగ్రామంలా మారిన రాజ్యంలో..
మానవ సంబంధాలు కనుమరుగవుతున్నాయి
విచ్చుకున్న భావాలపై గుచ్చుకున్నకత్తులే ఎక్కువ
నిర్భయ.. రోహిత్‌ల చావుకేకలూ విన్పిస్తున్నాయి
అయినా..
నా ముందు గురజాడ అడుగులున్నాయి..
జాషువా శ్రీశ్రీల భావాలున్నాయి..
ఝాన్సీల తెగువ పోరాటపటిమలు ఉన్నాయి
ఆధునిక సమాజంలో స్త్రీగా నేను..
ఈ చరిత్రను తిరగరాస్తూ
మార్పుకోసం ధైర్యంగా అడుగు ముందుకేస్తాను

❋

ఇల్లిరిగకుంటె (ఇల్లింతకుంట) లోని హోలికేశ్వరదేవరకు, తాపసుల ఆహార దానానికి, సింఘపరిశ(సింహపరిషత్)కు చెందిన బ్రహ్మేశ్వర పండితునికి దానం ఇచ్చినట్లు చెప్పబడింది.

పొలవాసలోని పులస్తేశ్వర దేవాలయంలోని క్రీ.శ.1108వ సంవత్సరపు మహామండలేశ్వర లట్టుటూరు పురవరేశ్వర మేడ క్ష్మాపతి విడుదల చేసిన శాసనంలో, పులస్త్యేశ్వర స్వామికి వీరబలంజ కులానికి చెందిన అయావళి - 500 స్వాములు, 36 వీడులకు చెందిన ముమ్మరిదండలు, ఉభయనానాదేశివర్తనులు, పులస్తేశ్వర పట్టణంలో (మంథని)మహానాడును నిర్వహించి నప్పుడు చేసిన దాన వివరాలున్నాయి. క్రీ.శ. 1112 డిసెంబర్ 25, బుధవారం నాటి నగునూరు శాసనంలో మహామండలేశ్వర పండరస, స్థానిక రవీశ్వర, భీమేశ్వర దేవాలయాలకు కొంత భూమిని దానం చేసినట్లు చెప్పబడింది. శనిగరంలోని క్రీ.శ. 1128వ సంవత్సరపు భూలోకమల్లదేవుని సామంతుడైన కాకతీయ రెండో పోలరాజు, అతని సామంతుడైన సబ్బి-1000కి చౌదరి అయినటువంటి రేపోలి కురువరాజు కండశనిగరంలోని సొమేశ్వర దేవునికి కొంత భూమి, ఒక రాట్నం, ఒక నూనెగానుగను దానం చేసిన వివరాలున్నాయి. శనిగరంలోని పార్థేశ్వరస్వామి దేవాలయం ముందున్న క్రీ.శ. 1149, మార్చి 25, శుక్రవారం నాటి రెండో జగదేక మల్లదేవుని సామంతుడైన మహామండలేశ్వర అన్న ముదుపురవరేశ్వర కాకతీయ పోళలరస అతని సామంతుడు చౌదరి రేపోల కురవరసని శాసనంలో, కమ్మకులాభరణ, దండనాయక మండపరస, పార్థేశ్వర స్వామి సేవలకు, తపోధనుల ఆహారానికి అవసరమైన కొంత నీరు నేల, ఒక రాట్నాన్ని, చంద్రాభరణ పండిత దేవునికి దానం చేసినట్లు చెప్పబడింది. కరీంనగర్ జిల్లాలో ఉన్న కన్నడ శాసనాల ద్వారా ఆనాడు తెలంగాణా రాజకీయ, ఆర్థిక, సామాజిక, మతపరమైన అనేక విషయాలు తెలుస్తున్నాయి.

❋

## రెండోవైపు

- బండ్ల మాధవరావు
8897623332



శిఖరపు చిటారుకొమ్మన
మాటల ఊయలలో ఊపుతూ
నన్ను నీ మాయాజాలంలో కట్టేశావు
ఏదో ఒకటి ఎంచుకోవాల్సిన
తప్పనిసరి స్థితిలో
వరమాల నీ మెడలోనే పడింది
నువ్వంటే ఎంత అసహ్యమైనా
కొండవాలుకు పయనించే క్రమంలో
నా ప్రమేయం లేకుండానే
నీ ఒళ్లో వాలాను
శాశ్వతం కావాల్సిన మాటల్ని
నీటిమీద రాస్తూ
వర్చువల్ రియాలిటీని నా ముందు పరుస్తున్నావు
మేలిముసుగు నల్లని నీడల్లో
మాటల కాంతిరేఖల్ని విసిరి
శాశ్వతంగా నన్ను చీకట్లోనే నిలిపావు
ఆకాశానికి ఎగసిన
దుర్మార్గపు నీ విజయహాసంలోని
వక్రత నన్ను వెంటాడుతూనే ఉంది

విజయం ఎప్పటికీ శాశ్వతం కాదు
అందునా తలకెక్కిన విజయం
పతనానికి మొదటి మెట్టు

❋

కపోతాల్లారా తాత్కాలికంగానైనా
రక్షిత ప్రాంతాలకు ఎగిరిపోండి
దేహం శిథిలం కాకముందే
మిత్రునికొక చివరి ఉత్తరం రాయండి
రేపటి కుట్రల్లో
నువ్వు లేకుండానే
నువ్వు వుండొచ్చు
కళ్లు కాళ్లూ లేకున్నా
నీపై భాగస్వామ్యాన్ని పులమొచ్చు
ఇప్పుడు వాడి మాటల కుట్రలకు బలైన నీకు
రేపు మాటే ఆయుధం కావాలి
పదునెక్కిన మాటల మంటల్ని
రేపటి కోసం వెలిగించాలి

❋

## Unity Strength

- వర్ధని
9440892122



కలిస్తే కలకాలం.. విడిపోతే క్షణకాలం...

ఎడముఖం - పెడముఖం
ఎందుకు మౌన సంకేతాలు

పంతాలు - పట్టింపులు
ఎదకు సంకెళ్ళు

అహం - ద్వేషం
హృదయానికి ముళ్ళు

ఆధిక్యం - రోషం
వీడాలి
కలిసి గెలవాలి
మనం ముందుకు నడవాలి

❋

## సాహితి వాహిని



డా॥ బన్న అయిలయ్య

వెల : 100/- పేజీలు: 192

ప్రతులకు : 0870-2456001

అయిలయ్య సూక్ష్మ విశ్లేషణాత్మక రీతిని ప్రదర్శించే మరో వ్యాస సంపుటి ప్రస్తుతం వెలువరిస్తున్న 'సాహితీ వాహిని'. కథ, శతకం, కవిత్వం, విమర్శ, వచన సాహిత్యం మున్నగు ప్రక్రియలకు సంబంధించిన వివేచానత్మకమైన పది వ్యాస తరంగాల సంగమం ఇది.

- ఆచార్య ఎస్వీ రామారావు

## నిశ్చల చిత్రం



దుట్టా శమంతకమణి

వెల : 50/- పేజీలు: 32

ప్రతులకు : 9490634849

'ఛాయాచిత్ర ప్రపంచంలో తనదైన, మనదైన ముద్రవేసిన ఫొటో ఇండియా శ్రీనివాసరెడ్డి ఈ రోజున వందలాది జాతీయ, అంతర్జాతీయ పురస్కారాల స్వీకర్త స్థాయికి ఎదిగిన తీరుని కథారచయిత్రి - సామాజిక కార్యకర్త దుట్టా శమంతకమణి అక్షరీకరించారు.

- సాహితీస్రవంతి, కృష్ణాజిల్లా

## కావ్య సంజీవి




శిఖామణి కవిత్వంపై విశ్లేషణ

డా॥ యు.ఎ. నరసింహమూర్తి

వెల : 50/- పేజీలు: 32

ప్రతులకు : 9848202526

సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు, పరిశోధకులు, రచయిత, కవీ, అనువాదకులు డా॥ ఉపాధ్యాయుల అప్పల నరసింహమూర్తి గారు ప్రముఖ కవి. కవిసంధ్య సంపాదకులు డా॥ శిఖామణి గారి కవిత్వంపై రాసిన విశ్లేషణాత్మక లఘుగ్రంథం 'కావ్య సంజీవి'.

- కవి సంధ్య గ్రంథమాల

## గోస కవిత్వం




బండారి రాజకుమార్

వెల : 60/- పేజీలు: 83

ప్రతులకు : 9959914956

ఈ కవితా సంపుటిలోని 37 కవితలు ఇంద్ర ధనుస్సులా వర్ణావరణ శోభితమై పఠితకు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ప్రకృతి అందాల్లానే పదాల అందాలు పరవశింపజేస్తాయి. కవన వనమంతా తంగేడు పూసి ముత్తెదువ తనంలో స్నానమాడినట్టుంది. సస్యం హరిత హారానికి ధారపోసిన శ్రామికుల చెమట చుక్కల వాసన గుభాళింపు కొడుతుంది.

- నసుమాస స్వామి

## చెరగని సిరామరకలు




ఎల్.ఎన్. కొల్లి

వెల : 30/- పేజీలు: 52

ప్రతులకు : 9441853658

అలవోకగా, భావ గాంభీర్యంతో చెప్పిన ప్రతీ కవిత కూడా, చివరికి సందేశాత్మక దిశగా సాగి, మానవ జన్మ సార్థకతనే ఆకాంక్షించడంలో కవి ప్రగాఢమైన సామాజిక మార్పు కోరుకోవడం కానవస్తుంది.

- మహేంద్రాడ సింహాచలాచార్య

## జ్ఞానేశ్వరా శతకం

ముంజం జ్ఞానేశ్వర్

వెల : 80/- పేజీలు: 80

ప్రతులకు : 9492794936

వచన కవిత్వం విరివిగా వస్తున్న సమకాలీన తరుణంలో పద్యం పట్ల మక్కువను పెంచుకొని, కఠినమైన మత్తేభ, శార్దూల పద్యాల ద్వారా ప్రతిభను చాటుకుంటున్నాడు ముంజం జ్ఞానేశ్వర్. విలువల పతనం పట్ల ఆవేదన తన పద్యాల్లో కన్పిస్తున్నది. జ్ఞానేశ్వర్ శతకం ద్వారా అనేక సమస్యల పట్ల స్పందించారు. ఉపదేశాలకే పరిమితం కాకుండా ఆచరణలో కూడా నిరూపించాలని కోరుకుంటున్నాడు ఈ యువకవి.

- గోపగాని రవీందర్

## మా ఊరు సంతరావూరు

**తోటకూర వేంకటనారాయణ**

వెల : 150/- పేజీలు: 200

ప్రతులకు : 8341586274



పల్లెటూరులో పుట్టి పెరిగిన తోటకూర వేంకటనారాయణ గారు పేగుతెంచుకుపుట్టిన ఆ ఊరు మీద ప్రేమ పెంచుకొన్నాడు. ఆ ఊరి చరిత్రను తెలుసుకొన్నాడు. శాతవాహనుల కాలం నుంచి వాసిరెడ్డి వారిదాకా గ్రామంలో జరిగిన చారిత్రక ఘట్టాలను వరుసక్రమంలో వివరించాడు.

**- డా॥ ఈమని శివనాగిరెడ్డి**

## రూపకత్రయం

**డా॥ ద్వా.నా.శాస్త్రి**

వెల : 50/- పేజీలు: 56

ప్రతులకు : 9849293376



'గురజాడ దర్బార్, పత్రికోద్యమ వికాసం, బులుసు సాంబమూర్తి ఈ మూడు విభాగాలుగా రాసిన ఈ రూపకత్రయం తెలుగు భాష, తెలుగునాట పత్రికల కృషి వంటి అంశాలను ఆసక్తికరంగా చిత్రించింది. గురజాడ దర్బార్‌లో గురజాడ, కందుకూరి, గిడుగు, జయంతి రామయ్య, వేదం వేంకటరాయశాస్త్రి, ఆదిభట్ల నారాయణదాసు, తాపీ ధర్మారావు, సి.పి.బ్రౌన్‌ల పేరిట జరిపిన సంభాషణ తెలుగు భాషా సాహిత్యాలపై అవగాహన పెంచుతుంది.

## శిథిల స్వరాలు కవిత్వం

**ఉండవిల్లి.ఎమ్**

వెల : 60/- పేజీలు: 78

ప్రతులకు : 9246415150



ఈయన కవిత్వంలో భావం ఎంత వాస్తవికమో, శైలి అంత సరళం. చదువుతుంటే, భావం వెంట చదువరి మనసు పరుగెత్తుకుపోతుంది. సామాజికమైన భావాలు చెప్పే కవికి యిలాటి శైలి ఉండి తీరాలి. ఎన్ని అలంకారాలు, ఇమేజిలు ప్రయోగించినా, కవి భావం అస్పష్టం, అయోమయం కారాదు.

**- అద్దేపల్లి రామమోహనరావు**

## జ్వలితార్ణవాలు వ్యాసాలు

**జ్వలిత**

వెల : 150/- పేజీలు: 200

ప్రతులకు : 9989198943



జ్వలిత రాసిన చాలా వ్యాసాల్లో స్త్రీ ప్రధాన వస్తువు. అయితే ఈ స్త్రీ అగ్రవర్ణ స్త్రీ కాదు. శూద్రవర్ణ స్త్రీ. శ్రమలో నిమగ్నమై శ్రమ జీవితమైన స్త్రీ. నిరంతరం అభద్రతతో బతుకుతున్న స్త్రీ. ఉన్నత స్థాయి ప్రజా ప్రతినిధులు, డిజిపి స్థాయి పోలీసు అధికారులు, నిత్యం ప్రజలకు బోధనలు చేసే స్వామీజీలు, బాబాలు ఎంత జ్ఞానహీనంగా ఎంత పురుషాధిక్య మూర్ఖతతో వున్నారో జ్వలిత చర్చకు పెట్టింది.

**- డా॥ ఎమ్.ఎమ్. వినోదిని**

## తెలుగమ్మ ఒడిలో బౌద్ధం

**బొర్రా గోవర్ధన్**

వెల : 80/- పేజీలు: 102

ప్రతులకు : 9848199098



తెలుగునేలపై బౌద్ధం ఎలా విలసిల్లిందో వివిధ కోణాల్లో తెలిపిన రచనలు కొందరు పెద్దలు వ్రాసినవి ఉన్నాయి. చరిత్రను, చారిత్రక అవశేషాలనూ తెలిపేవి వాటిలో ప్రముఖంగా ఉన్నాయి. అయితే, ఈ రచయిత చూపు, చెప్పిన తీరు విభిన్నం. నేరుగా చదువరుల గుండెల్ని తాకి, ఆలోచింపజేసే విధంగా శ్రీ గోవర్ధన్ రచన సాగింది.

**- డా॥ సామల రమేష్‌బాబు**

## కవిసంధ్య

**యానాం కవితోత్సవ ప్రత్యేక సంచిక**

వెల : 50/- పేజీలు: 128

ప్రతులకు : 9440127967



కవిసంధ్య ముచ్చటగా మూడు సంచికలను దాటి నాలుగో సంచికలోకి అడుగుపెట్టింది. సోషల్ మీడియా వెల్లువలో సాహిత్యాధ్యయనం గాలికి కొట్టుకుపోయిందనే మాట కవిసంధ్యకు అందుతున్న ఆదరాభిమానాల వల్ల అబద్ధం అని తేలింది. ఈ సంచిక వజ్రాయుధ కవి, అభ్యుదయ సాహిత్యోద్యమ నాయకుడు ఆవంత్స సోమసుందర్ ముఖచిత్రంతో వెలువడుతోంది.

**- సంపాదకీయం నుండి**

## యువతరం నీలో నిన్ను చూసుకో




డా॥ తవ్వా వెంకటయ్య

వెల : 150/- పేజీలు: 184

ప్రతులకు : 9703912727

ఈ పుస్తకం గాలిలోంచి పుట్టలేదు. శూన్యంలోంచి పదాలు పుట్టవు. గత పాతిక ముప్పై ఏళ్ళుగా ప్రపంచీకరణ రూపంలో మన దేశంలోకి దిగుమతి అయిన విషసంస్కృతిని, అది మన యువకుల మీద చూపిస్తున్న ప్రభావాన్ని ప్రత్యక్షంగా గమనించి, అధ్యయనం చేసి వెంకటయ్య ఈ పుస్తకం రాశాడు.

- డా॥ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

## నిశ్శబ్ద ప్రతిధ్వని కథా సంపుటి




యల్. రాజాగణేష్

వెల : 60/- పేజీలు: 148

ప్రతులకు : 9247483700

తనకు బాగా తెలిసివున్న మధ్యతరగతి, దిగువ తరగతి మనుషుల కథలనూ, వారి అంతరంగాలనూ ఆపోశనపట్టిన రాజా గణేష్ తన కలం ద్వారా వాటిని అక్షరబద్ధం చేశారు. ఈ రకంగా చెయ్యాలంటే ఏ రచయితకైనా, ఏ రచయిత్రికైనా తాను జీవిస్తోన్న సమాజం పట్ల ప్రేమాభిమానాలు ఉండాలి.

- ఎమ్.వి.వి. సత్యనారాయణ

## అత్యాధునిక కవితారూప ప్రక్రియ - నానీ




చలపాక ప్రకాష్

వెల : 87/- పేజీలు: 352

ప్రతులకు : 9247475975

ఈ నానీల పరిశోధన 1997 నుండి ప్రారంభించబడి, ఈ ఫెలోషిప్ కాలం 2010 వరకు వచ్చిన నానీలు, వ్యాస సంపుటుల్ని పరిశోధనకు తీసుకోవడం జరిగింది. ఈ పుస్తకం ఎప్పుడో రావలసి ఉంది. కొన్ని అనివార్యకారణాల వలన ఆలశ్యమైంది. అయితే ఈ పుస్తకం వెలువడకముందే వెలువడిన ఇతర నానీ పరిశోధనా వ్యాససంపుటాల్లో నా ఈ సంపుటిలోని విషయాలను ప్రస్తావించారు.

- చలపాక ప్రకాష్

## సోమసుందర్ విమర్శనా సుమనోశాల




ప్రథమ భాగం

హెచ్.ఎస్.వి.కె. రంగారావు

వెల :50/- పేజీలు: 160

ప్రతులకు : 9885389759

భావకవిత్వోద్యమం గురించిన సో.సు.దర్శనం భిన్నమైనది. మన సాంస్కృతిక చరిత్ర పురోగమనంలో భావకవిత్వోద్యమం సముజ్వల పాత్ర వహించిన ఉద్యమం. స్థలకాలాది పరిమితులకు లోబడే ఏ ఉద్యమాలయినా సమీక్షించవలసిన కర్తవ్యం విమర్శకునిది అని భావించి ఆ దృక్పథంతోనే ఆయన 'భావ' కవుల మీద అనేక ఉపన్యాసాలూ, రచనలూ చేశారు.

- రంగారావు

## అక్షర పుష్పాలు - భావ సౌరభాలు




ఖమ్మం బాలకవుల రచనల సంకలనం

సంపాదకురాలు: దెంచనాల

విజయకుమారి (జ్వలిత)

వెల : 80/- పేజీలు: 80

ప్రతులకు : 9989198943

ఈ పుష్పాల చిరు సౌరభాలను పుస్తక రూపంలో సంకలనం చెయ్యడం ద్వారా పాఠశాలకు ఒక జ్ఞాపికను అందించడం నా ఉద్దేశ్యం. ఇది పాఠశాల మాగజైన్ కాదు విద్యార్థుల ప్రతి స్పందనలను నూతన విద్యా విధానం ఫలితాన్ని, విద్యార్థుల విజయంగా చూపించడం మాత్రమే.

- డి. విజయకుమారి (జ్వలిత)

## కవితాధ్యానం




ఆప్తచైతన్య

వెల :80/- పేజీలు: 106

ప్రతులకు : 9849227509

మౌనం నుంచి మౌనానికి చేసే ఈ ప్రయాణంలో సాధకుల మానసికావస్థలన్నీ గోచరమవుతున్నాయి. కాబట్టి ఈ కవిత్వం మనకొక సాధకుడు ఆయాచితంగా తన ఆత్మ రహస్యాన్ని విప్పి చెప్పినట్టయ్యింది.

- వాడ్రేవు చినవీరభద్రుడు

# రెక్కలు

- డా॥మౌని
93970 48771



రెక్కల కష్టం
మనిషిది
రెక్కల బతుకు
పక్షిది -

జీవనాధారం
రెక్క !

మర్రివిత్తుల్లా
కన్పిస్తారు
మహావృక్షాలై
ఎదుగుతారు -

మనుషుల్లో
మహాత్ములు !

రెక్కల్ని ప్రేమించే వాడికి
ఆకాశమే హద్దు
ఆశయంతో బ్రతికే వాడికి
గెలుపు మాత్రమే ముద్దు

ధ్యేయం -
వెలిగించే దీపం !

అణుబాంబు
సృష్టి
సార్వభౌమత్వాన్ని
కోరుతూ -.

మానవ
తప్పిదం !

ఖడ్గంతో
ప్రేమలేఖ రాసి
'కామం'
ప్రేమను హత్యచేసింది -

జనారణ్యంలో
అబల చావుకేక!

రాజకీయపు కుంచెతో
కులాల రంగుల చిత్రం
దేశంలో అంటరానితనం
బొమ్మకట్టిన ఒక ఇంద్రధనుస్సు -

దళిత వ్యవస్థపై
రాజముద్ర !

పేదవాడికి
అగ్గిపుల్లకూ
తలమాత్రమే వుంటుంది
రగిలేందుకు -

విస్ఫోటిస్తుంది
అణువు !

హరిజనవాడల్లో
అక్షర జెండాలు
విద్యావనంలో
హరిచందన వృక్షాలు -

సుగంధపరిమళం
అంబేద్కర్ !

ఆసరా కోసం
అంగలారుస్తూ వృద్ధులు
మళ్లీ బాల్యంలోకి
ప్రయాణిస్తూ. -

దశలు
అనివార్యం!

కాలుష్యం
రాజుకుంది
పర్యావరణం
పాడయ్యింది -

మనిషి దురాశ
మహాదుఃఖం !

వ్యవసాయంలో
వ్యయం బరువు
సాయం చెయ్యడం అటుంచి
సాయం కరువైన బతుకు -

కరిమింగిన
వెలగపండు !

నీతిని
చాటేందుకు
గొంతెత్తింది
వేమన పద్యం -

నైతిక బోధ
కవి బాధ్యత!

అవసరమైతే
ఒక్క గెలుపుకోసం
భరించాల్సిందే
వంద ఓటముల్ని -

హిమాలయం
మహోన్నతం !

❋

# కదిరిలో ఇప్పుడు వీస్తున్న గాలి




సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కదిరిలో యమ్ ఆర్ సి భవనంలో ఫిబ్రవరి 26న అదినారాయణరెడ్డి అధ్యక్షతన జరిగిన ఇపుడు వీస్తున్నగాలి కార్యక్రమం జరిగింది. చంద్రశేఖర శాస్త్రి రచించిన కత్తులవంతెన కవితా సంపుటిపై సాహితీస్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యుడు పిల్లా కుమారస్వామి సమీక్ష చేస్తూ కవి సమాజాన్ని బాగా అధ్యయనం చేశాడన్నారు. రైతుల ఆత్మహత్యలన్ని రాజ్యం చేస్తున్న హత్యలని కవి చెప్పడం కవి ఎవరి పక్షమో తెలుస్తోందన్నారు. చంద్రశేఖర్ శాస్త్రి మాట్లాడుతూ కవులు సమాజంలో ప్రజలకు జరుగుతున్న అన్యాయాలను తమ కవిత్వం ద్వారా ప్రశ్నించాలని అన్నారు. సాహితీస్రవంతి పట్టణ అధ్యక్షుడు చెన్నక్రిష్ణ మాట్లాడుతూ చంద్రశేఖరశాస్త్రి సమకాలీన జీవితాన్ని తన కవిత్వంలో వ్యక్తీకరించాడన్నారు. సాహితీస్రవంతి ప్రధాన కార్యదర్శి రాజశేఖర్ మాట్లాడుతూ చం ప్రజాకవి అని కొనియాడారు. ఈ కార్యక్రమం లో ధర్మవరం నుండి వచ్చిన సాహితీవేత్త షమీవుల్లా అనంతపురం నుండి వచ్చిన అంకె శ్రీనివాస్ కవులు శంకరనారాయణరాజు సుందరమోహన రెడ్డి లెక్చరర్ కవిత, ఓబులాపతి, అబ్దుల్లాఖాన్ తదితరులు పాల్గొన్నారు. ❋



హైదరాబాద్‌లో మార్చి21 న జరిగిన నవ తెలంగాణ దిన పత్రిక 2 వ వార్షికోత్సవ సభలో నవ తెలంగాణ దిన పత్రిక నిర్వహించిన దాశరథి రంగాచార్య స్మారక కవితల పోటీలో "జ్ఞాన వాక్యం" కవితకు ప్రథమ బహుమతి అందుకుంటున్న కె. విల్సన్‌రావు. తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి ప్రొ॥ ఎస్.వి.సత్యనారాయణ, 10 టి.వి మేనేజింగ్ డైరెక్టర్ కె.వేణుగోపాల్



ప్రకాశం జిల్లా మార్టూరులో మార్చి 12న 'రమ్యభారతి' ఆధ్వర్యంలో జరిగిన 'సోమేపల్లి పురస్కార కథలు-2' ఆవిష్కరిస్తున్న పర్చూరు శాసన సభ్యులు ఏలూరి సాంబశివరావు. చిత్రంలో బీరం సుందరరావు, కాటూరి రవీంద్రత్రివిక్రమ్, బి.హనుమారెడ్డి, పొన్నూరు వేంకట శ్రీనివాసులు, సోమేపల్లి వెంకటసుబ్బయ్య, జెన్నీ, సోమేపల్లి వెంకటేశ్వర్లు, చలపాక ప్రకాష్



అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా గుంటూరు జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో ఫిబ్రవరి 21న అన్నమయ్య కళావేదికలో ప్రదర్శించిన 'కృష్ణ దేవరాయల సభ' రూపకం దృశ్యం. కృష్ణ దేవరాయలుగా పిఎస్ఆర్ ఆంజనేయ ప్రసాద్, తిక్కన సోమయాజిగా పింగళి వెంకటకృష్ణారావు, విశ్వనాథ సత్యనారాయణగా మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, కవయిత్రి మొల్లగా డా॥ వి. నాగలక్ష్మి, గురజాడ అప్పారావుగా జంధ్యాల మహతి శంకర్ నటించారు.



గుంటూరులో ఫిబ్రవరి 19న జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో గుంటూరు జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన ఎన్.వి. సత్యనారాయణ (నానా) రాసిన 'వేదన - నివేదన' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న శాసనమండలి పూర్వ సభ్యులు కె.ఎస్. లక్ష్మణరావు. చిత్రంలో సోమేపల్లి వెంకటసుబ్బయ్య, ఎస్.ఎం. సుభానీ తదితరులు

## ఏప్రిల్ 30న అనంతపురంలో ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన రాష్ట్ర సదస్సుకు ఆహ్వానం

ప్రజాకవి వేమన సాహిత్యంపై రాష్ట్ర స్థాయి సదస్సును అనంతపురంలో ఏప్రిల్ 30న నిర్వహిస్తున్నట్లు ప్రజాకవి **వేమన సాహితీ సమాలోచన రాష్ట్ర సదస్సు ఆహ్వాన సంఘం** అధ్యక్షులు డా॥ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి ఒక ప్రకటనలో తెలిపారు. పూర్తిరోజు జరిగే ఈ సదస్సులో ఉభయ తెలుగు రాష్ట్రాల నుండి ప్రముఖ రచయితలు పాల్గొంటున్నారని, వేమన రచనలపై వివిధ కోణాలలో విశ్లేషణలు, చర్చలు జరుగుతాయని, ఈ సందర్భంగా వేమన జీవిత సాహిత్యాన్ని ప్రతిబింబించే రీతిలో 'ప్రజాకవి వేమన' రూపకాన్ని ప్రజానాట్యమండలి బృందం ప్రదర్శించ నున్నదని తెలిపారు. ప్రజాశక్తి బుక్‌హౌస్ వేమన పద్యాల ప్రచురణతో పాటు, ఆయన రచనలపై సుమారు 15 పుస్తకాలను ఈ సదస్సులో ఆవిష్కరించనున్నట్లు తెలిపారు. అనంతపురం పట్టణంలో పాతవూరులో గల పద్మావతి ఫంక్షన్ హాలులో జరిగే ఈ కార్యక్రమానికి ఉభయ రాష్ట్రాలలోని రచయితలు, కవులు, వేమన అభిమానులు పెద్దయెత్తున పాల్గొని జయప్రదం చేయవలసిందిగా విజ్ఞప్తి చేశారు. వివరాలకు వి. కుమారస్వామి (అనంతపురం 9490122229, జంధ్యాల రఘుబాబు (కర్నూలు) 9849753298, మస్తాన్‌వలి (కడప) 9490099284, ఓట్ర వెంకటరమణ (చిత్తూరు) 9494512930 ద్వారా సంప్రదించవలసిందిగా కోరారు.

## డా॥ ప్రసాదమూర్తికి ఉమ్మడిశెట్టి పురస్కారం



ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు – 2016ను చేనుగట్టు పియానో కవి డా॥ ప్రసాదమూర్తిని ఎంపిక చేసినట్టు సంస్థ వ్యవస్థాపకులు డా॥ రాధేయ ఒక ప్రకటనలో తెలిపారు. జూన్ నెలలో అనంతపురంలో జరిగే ఒక కార్యక్రమంలో ఈ అవార్డును ప్రధానం చేయనున్నట్లు తెలిపారు. ఈ ఎంపికకు డా॥ పాపినేని శివశంకర్, ఆచార్య బన్న అయిలయ్య, అరసవిల్లి కృష్ణ న్యాయనిర్ణేతలుగా వ్యవహరించినట్లు ఆయన తెలిపారు.

## బలివాడ రచనలపై వ్యాస రచన పోటీ

ప్రముఖ రచయిత బలివాడ కాంతారావు 90వ జయంతి సందర్భంగా ఆయన కథలు, నవలలు, నాటికలపై విడివిడిగా సమీక్ష, వ్యాస రచన పోటీలను నిర్వహిస్తున్నట్లు అడపా రామకృష్ణ ఒక ప్రకటనలో తెలిపారు. విశాఖపట్నంలోని భారతనిధి ఫౌండేషన్, విశాఖ రచయితల సంఘం, విశాఖ సంస్కృతి మాసపత్రిక సంయుక్త ఆధ్వర్యంలో జరిగే ఈ పోటీలకు మే 10 వ తేదిలోపు తమ రచనలను అడపా రామకృష్ణ, కార్యదర్శి, విశాఖ రచయితల సంఘం, డోర్ నెం. 43-21-21, వరుణ్ షోరూం ఎదురుగా, దొండపర్తి జంక్షన్, విశాఖపట్నం - 530 016 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9505269091 ద్వారా సంప్రదించవచ్చును.

## బుద్ధునిపై పాటలు పంపండి

బుద్ధుడిని జనానికి ఎరుకపరిచే పాటలను రాసి పంపవలసిందిగా ఎం.సి. రావు ఒక ప్రకటనలో కోరారు. బుద్ధుడు దేవుడు కాదు. ఆయన్ని ఇంద్రుడు, చంద్రుడు అని స్తుతించే పాటలు వద్దని, ఆయన చెప్పిన మాటలను పాటలుగా మలిచి పంపవలసిందిగా కోరారు. వాటిని సి.డి. రూపంలో తీసుకురానున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. పాటలను **buddhadarsanam@outlook.com** ఇమెయిల్‌కు పంపవచ్చు.

## ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం వేడుకలు

ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలోని కవులు, రచయితలను అనుసంధానం చేస్తూ వారి సమస్యలను, సంఘం పరిధిలో పరిష్కరించేందుకు కృషి చేయాలనే సంకల్పంతో 'రచయితల సంఘం- ఆంధ్రప్రదేశ్' వేడుకలు మే 13, 14 తేదీలలో విజయవాడలో నిర్వహిస్తున్నట్లు నిర్వాహకులు సోమేపల్లి వెంకటసుబ్బయ్య, చలపాక ప్రకాష్, కలిమిశ్రీ ఒక సంయుక్త ప్రకటనలో తెలిపారు. ఈ కార్యక్రమంలో పుస్తకావిష్కరణలు, కవిసమ్మేళనం ఉంటాయని ఆసక్తి కలవారు ఏప్రిల్ 20వ తేదిలోపుగా పేర్లను నమోదు చేసుకోవలసిందిగా కోరారు. వివరాలకు 9247475975, 9246415150 ద్వారా సంప్రదించవచ్చును.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# కందుకూరి వీరేశలింగం

(16.04.1848 - 27.05.1919)



నవ్యాంధ్ర వైతాళికుల్లో ప్రథములు, సంస్కర్త, వితంతు వివాహాలను ఉద్యమంగా చేపట్టారు. మహిళల విద్యాభివృద్ధికి కృషిచేశారు. సాంఘిక దురాచారాలను ప్రతిఘటించారు. సాహితీరంగంలో గొప్ప కృషి జరిపారు. పలు పత్రికలు కూడా నడిపి, కొత్త రచయితలను ప్రోత్సహించారు.

PRSVMORALFI

**Date of Posting : 01.04.2017 ▪ Date of Publication: 27.03.2017**



| | |
|---|---|
| | **మనసు ఫౌండేషన్**<br>**పుస్తకాల పరిశీలనాపట్టిక** |
| **పుస్తకం సంఖ్య** | PRSVMODA 179 |
| **పుస్తకం పేరు** | ప్రస్థానం 4 |
| **తారీఖు** | 25/5/24 |
| **ముందు అట్ట** | yes |
| **వెనుక అట్ట** | yes |
| **మొత్తం పేజీలు** | 53 |
| **పెద్ద సైజు పేజీలు** | NO |
| **ఖాళీ పేజీలు** | NO |
| **లేని పేజీలు** | NO |
| **తయారు చేసినది** | Gayatri |
| **పేజీలు విడదీసినది** | Gayatri |
| **స్కాన్ చేసినది** | K Daveep |
| **పరీక్ష చేసినది** | prathyusha |
| **పేజీలు సరిచూసినది** | |
| **బైండింగు చేసినది** | |
| **ప్యాకింగు చేసినది** | |
| **స్కాన్ చెయ్యనివి** | |
| **తప్పులు** | No |
| **పరిస్థితి** | good |